# చారిత్రక భౌతికవాదం



★



రచన:
ఏటుకూరు బలరామమూర్తి
నండూరి ప్రసాదరావు

★

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

# ఉపోద్ఘాతము



తత్వశాస్త్ర ప్రథమ పాఠాలలో మూడవ పుస్తకంగా చారిత్రక భౌతిక వాదాన్ని పాఠకులకు అందజేస్తున్నాము.

చారిత్రక భౌతికవాద సూత్రాలను సాధ్యమైనంత సులభ పద్ధతిలో పాఠకులకు అందించవలెనని మా ప్రయత్నం. మా ప్రయత్నం ఎంతవరకు జయప్రదమైనది నిర్ణయించవలసినది పాఠకులే. ఇంతకు పూర్వం వెలువడిన పరిణామవాదము, గతితార్కిక భౌతికవాదము అను పుస్తకాలు, ఈ పుస్తకము- ఈ మూడింటిని వరుసగా అధ్యయనం చేసినట్లయితే మార్క్సిస్టు భౌతిక వాద సిద్ధాంతాన్ని గురించిన సమగ్ర దృక్పథము పాఠకులకు ఏర్పడగలదనే మా విశ్వాసం.

“సమాజ చరిత్రలో వివిధ దశలు” అను అధ్యాయంలో పెట్టుబడిదారీ, సోషలిస్టు వ్యవస్థలను గురించి క్లుప్తంగామాత్రమే వివరించాము. పెట్టుబడిదారీ విధాన చరిత్రను గురించి, సోషలిస్టు సమాజ చరిత్రను గురించి ఇతర గ్రంథాలు ఉన్నవి గనుక, ఈ క్లుప్తీకరణ చేయటం జరిగింది.

**23–6–1954,**
విజయవాడ.

ఇట్లు,
రచయితలు.



# విషయ సూచిక







5

23-8-54

112

# 1. చరిత్ర అంటే ఏమిటి?

మానవసమాజచరిత్ర నిరంతరం మార్పు చెందుతున్నది. దేశచరిత్రలను అధ్యయనంచేసే ప్రతి విద్యార్థి ఒకవిషయాన్ని గమనించగలడు. పూర్వకాలపు వ్యవస్థలు ఈనాడు లేవు. ఒకప్పుడు నిరంకుశ రాచరికవ్యవస్థ ప్రపంచమంతటా ఉండేది. అది ఈనాడు ప్రపంచంలో ఏదోఒక మారుమూల మిగిలి ఉండవచ్చు. కాని మొత్తంమీద నశించిపోయింది. వెనుక తరాలవారు కనీవినీ ఎరుగని శాస్త్రపరిశోధనలు ఈనాడు జరుగుతున్నాయి. ఆధునిక విజ్ఞానశాస్త్రంవల్ల ఈనాడు ఎన్నో ప్రయోజనాలు పొందుతున్నాము. ఒకప్పుడు లేని యంత్ర నాగరికత నేడు ప్రపంచమంతటా ఆవరించింది.

మానవుడు తన భుక్తిని గడుపుకోటానికి ఒకప్పుడు జంతువులను వేటాడుట ప్రధానవృత్తిగా ఉండేది. ఆ తర్వాత క్రమంగా మానవుడు పశుపోషణ నేర్చుకున్నాడు. భూమిని దున్ని, పైరులను పండించి, తానింత తిని, పొరుగువారి కింత పెట్టగల సామర్థ్యాన్ని సంపాదించుకున్నాడు. భూగర్భంలోని గనులను త్రవ్వి, లోహాలను పైకితీసి పనిముట్లను చేసుకున్నాడు. వ్యవసాయంతోపాటు చేతిపరిశ్రమలు వృద్ధియైనవి. నేతపరిశ్రమ, వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, శిల్పం ఇత్యాది వివిధ వృత్తులను మానవుడు నేర్చుకున్నాడు. యంత్రయుగ ఆవిర్భావంతో యివన్నీ మారిపోయి, అత్యంత ఆధునికమైన పనిముట్లను వాడటం నేర్చుకుంటున్నాము. చివరకు హెచ్చవేత, భాగహారం,

కూడిక, తీసివేత మొదలైన పనులుసైతం యంత్రసహాయంతో చేసే యుగంలో మనం నివసిస్తున్నాము.

ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలోనేగాక, మానవుల భావప్రపంచానికి సంబంధించిన తత్వశాస్త్రము, నీతి నియమాలు, జీవితదృక్పథము మొదలైన అన్ని విషయాలలోను ఎన్నో మార్పులు జరిగినవి. ఇంకా జరుగుతున్నవి.

నిరంతర పరిణామశీలమైన ఈ ప్రపంచ చరిత్ర ఏవైనా కొన్ని నిర్దిష్టసూత్రాల కనుగుణ్యంగా నడుస్తున్నదా లేక ఏవో దైవికమైన, అనూహ్యమైన కారణాలవల్ల ఈ మార్పులు జరుగుతున్నవా అన్న ప్రశ్న ప్రతివ్యక్తినీ ఎదుర్కొంటున్నది.

చరిత్రలో వివిధరంగాలలో నిత్యమూ జరుగుతున్న మార్పులు కేవలం యాదృచ్ఛిక ఘటనలు కావని, ఈమార్పులు కొన్ని నిర్ణీతసూత్రాల కనుగుణ్యంగా జరుగుతున్నవని మార్క్సిస్టు సిద్ధాంతము తెలియజేస్తుంది. పదార్థ విజ్ఞాన శాస్త్రము, రసాయనశాస్త్రము, ఖగోళశాస్త్రం – మొదలైన శాస్త్రాలు ఆయాసమస్యలను గురించి ఖచ్చితమైన పరిజ్ఞానాన్ని మానవునికి కలుగజేస్తున్నవి. వీనిని ప్రామాణికమైన విజ్ఞాన శాస్త్రాలు(accurate sciences)అని మనంవ్యవహరిస్తున్నాము. సమాజ పరిణామశాస్త్రం, చరిత్ర, తత్వశాస్త్రము మొదలైన సామాజిక శాస్త్రాలలోకూడా ప్రామాణిక విజ్ఞానాన్ని సంపాదించవచ్చునని మొట్టమొదటగా కారల్‌మార్క్స నిరూపించాడు. చరిత్ర పరిణామాన్ని వివరించే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని మనం చారిత్రక భౌతికవాదము అని పిలుస్తున్నాము.

మానవస్వరూపము భూమిపై ఏర్పడి నేటికి 5 లక్షల సంవత్సరాలు. నాగరికత ప్రారంభమై 10 వేల సంవత్సరాలు మాత్రమే. అందులోను యంత్రనాగరికత ప్రారంభమై నేటికి 4, 5 శతాబ్దులు మాత్రమే.

మానవ పురోగమనం అంతా ఒక గంటకాలంలో జరిగినట్లు భావించినట్లైతే, అందులో 59 నిమిషాలు, మానవుడు ఆటవికదశనుండి విడివడి రాతిపనిముట్లను వాడుకోటం నేర్చుకునేవరకు జరిగిన గాధ, ఆక్రమిస్తుంది. నాగరికత చరిత్ర ప్రారంభమై 1 నిమిషము మాత్రం అయిందన్నమాట.

నాగరికత ప్రారంభమైన తర్వాతి మానవచరిత్రనే మనం ఈ గ్రంథంలో పరిశీలించ పూనుకుందాము.

## 2. చారిత్రక భౌతికవాదం

ప్రపంచ సమస్యలను పరిశీలించటంలో భౌతికవాద దృక్పథం అవలంబించవలెనని, అదే సరియైన దృక్పథమని మార్క్సిజం భావిస్తుంది. ప్రపంచానికంతా మూలము, పునాది పదార్థము. ఈపదార్థము వివిధరూపాలలో, ఎమీబానుండి మానవునివరకు పరిణామం చెందుతూవచ్చింది. ఈపరిణామ క్రమంలో చాలాకాలానికి ఏర్పడ్డ మానవునికి అంతకుపూర్వం జీవకోటికి లేని ఆలోచనాశక్తి, అందు కవసరమైన మెదడు అనే అవయవం ఏర్పడ్డవి. మానవుని ఆలోచననే భావము అని అంటున్నాము. కనుక పదార్థము అనాదిగా వస్తున్నది, ప్రాథమికమైనది. భావము తర్వాత చాలాకాలానికి ఏర్పడ్డది.

పదార్థ పరిణామక్రమంలో అత్యున్నతరూపమైన 'మెదడు' అనే అవయవంద్వారా భావము ఏర్పడ్డది. పదార్థానికి, భావానికిగల అన్యోన్య సంబంధాన్ని పైవిధంగా వివరించే సిద్ధాంతమే భౌతికవాద సిద్ధాంతం.

ఈ భౌతికవాద దృక్పథాన్ని చరిత్రకు వర్తింపచేస్తే చారిత్రక భౌతికవాద సిద్ధాంతం ఏర్పడుతున్నది. ప్రతి సామ్రాజిక వ్యవస్థలోను, ఆర్థికవిధానము, రాజకీయవ్యవస్థ, సాంఘి కాచారాలు, తత్వశాస్త్రం - ఇత్యాది వివిధ ఉపాంగాలూ ఉంటాయి. అయితే వీనిలో ప్రాథమికమైనదీ, పునాదివలె ఉపకరించేదీ, ఏదైనా ఉన్నదా అని మనం ఆలోచించినప్పుడు, ఆర్థికవిధానం మిగతా అన్నిటికంటె ప్రాథమికమైనదని, పునాది వంటిదని మనకు బోధపడుతుంది. ఒక వ్యక్తి జీవితానికి తిండి, బట్ట, నివాసము ఎంత ముఖ్యమో, ఒక సమాజంయొక్క జీవితానికికూడా ఆర్థికవిధానం అంతే ముఖ్యం. లడ్విగ్ ఫ్యూర్ బా అను జర్మను తత్వవేత్త సిద్ధాంతాలను విమర్శిస్తూ వ్రాసిన పుస్తకంలో ఎంగెల్స్ ఇలా అన్నాడు! "మానవుడు మొట్టమొదటగా ఆహారం సంపాదించటం, జీవించటం ప్రారం భించాలి. ఆ తర్వాతనే అతను ఆలోచించటం నేర్చుకోగలడు."

ఆర్థిక విధానము లేక ఉత్పత్తి విధానము అంటే అర్థ మేమిటి? మానవులు మొదటినుంచి గుంపులు గుంపులుగా జీవిస్తూవచ్చారు. ఆహార సంపాదనకు వారు చేసే ప్రయత్నం కూడా సమిష్టిగానే ఉంటూఉండేది. అతి ప్రాథమికమైన చేపలు పట్టేవల, ఈటె మొద్దలైన ఉత్పత్తి సాధనాలను చేతధరించి వారు గుంపులు గుంపులుగా ఆహార సంపాదనకు బయలుదేరే

వారు. ఆహార సంపాదనకు పనిముట్లు ఎంత అవసరమో, వ్యక్తుల పరస్పర సహకారముగూడా అంతే అవసరం. ఒక పెద్ద చేపలుపట్టే వలను నిర్మించి, దానిని మోసుకువెళ్లి, నీళ్ళలో చేపలుపట్టి వాటిని పోగుచేసుకొని వచ్చిన ఒక గుంపు ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో తమలోతాము చేసుకున్న సహకారాన్ని ఆర్థిక సంబంధాలు, లేక ఉత్పత్తి సంబంధాలు (Relations of Production) అని మనము వ్యవహరిస్తున్నాము. అతి ప్రాథమికమైన చేపలు పట్టేవల మొదలుకొని, అత్యంత ఆధునికమైన యంత్రపరికరాలవరకు ప్రజల ఆహార సంపాదన కుపయోగపడే పనిముట్లను ఉత్పత్తిసాధనాలు లేక ఉత్పత్తిపరికరాలు (Means of Production), పనిముట్లు అని వ్యవహరిస్తున్నాము.

అయితే కేవలం ఉత్పత్తిసాధనాలు, లేక పరికరాలు మాత్రమేగాక, మరికొన్ని అత్యవసరమైన విషయాలుకూడా ఉంటేతప్ప ఉత్పత్తి కొనసాగదు. శ్రమచేసే మానవుడు లేనిదే పనిముట్లూ వాటంతటవి కదలవుకదా ? కనుక మానవుడు, ఉత్పత్తి కవసరమైన ప్రధానాంగాలలో ఒకడు. అదేవిధంగా వ్యవసాయాన్ని మానవుడు నేర్చుకున్నప్పటినుంచి, భూమికూడా ఉత్పత్తికి అత్యవసరమైన వస్తువుగా తయారైంది. కనుక భూమి, మానవుడు, పనిముట్లు వీటన్నిటిని కలిపే ఉత్పత్తిశక్తులు (Productive forces) అని వ్యవహరిస్తున్నాము. తేలికగా చెప్పాలంటే, ఉత్పత్తిసాధనాలు, లేక ఉత్పత్తి పరికరాలు (Means of Production), భూమి, మానవుడు ఇవన్నీ కలిస్తే ఉత్పత్తిశకులు ఔతాయి.

ఈ ఉత్పత్తి సంబంధాలు స్వేచ్ఛాసమానత్వ ప్రాతిపదికపై ఏర్పడిన సంబంధాలుకావచ్చు. లేక అసమానత్వము, ఆర్థికదోపిడిపై ఆధారపడినవి కావచ్చు. పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో కార్మికులు తమజీవితం కొనసాగించుకునేందుకు వేరే ఆధారంలేక, ఫాక్టరీలో కూలికి వెళ్ళుతున్నారు. లక్షలు ధనమార్జించిన పెట్టుబడిదారు, తనకుగల డబ్బును అవకాశంగా తీసుకొని, యంత్రాలను, ముడిసరుకులను కొని, కార్మికులకు కొంతజీతం యిచ్చి వారిచే పనిచేయించుకొని, ఉత్పత్తి కొనసాగిస్తూన్నాడు. ఈనాటి పెట్టుబడిదారీ సమాజంలో పెట్టుబడిదారు, కార్మికునికిగల సంబంధాలను ఆర్థికసంబంధాలు లేక ఉత్పత్తిసంబంధాలు అని అంటాము. అయితే ఈ సంబంధాలు సమానత్వ ప్రాతిపదికపైగాక, ఆర్థికదోపిడీ ప్రాతిపదికపై ఆధారపడి ఉన్నవని మనము తెలుసుకోగలము.

ఇదేవిధంగా, గత చరిత్రలో ఫ్యూడల్ భూస్వామికి అర్థబానిసకు గల సంబంధాలు, ఇంకా అంతకుపూర్వం బానిస యజమానులకు, బానిసలకు గల సంబంధాలు – ఇవన్నీ కూడా అసమానత్వంపై ఆధారపడ్డ ఆర్థిక సంబంధాలు. ఆదిమ కమ్యూనిస్టు దశలోగల ఉత్పత్తి సంబంధాలు, యీనాడు తిరిగి కమ్యూనిజం స్థాపించబడుతున్న సోవియటు రష్యాలో గల ఆర్థిక సంబంధాలు – సమానత్వ ప్రాతిపదికపైన ఏర్పడిన ఆర్థిక సంబంధాలు.

ఉత్పత్తిశక్తులు, ఉత్పత్తి సంబంధాలు – ఇవన్నీ కలిసే ఉత్పత్తివిధానము లేక ఆర్థికవిధానము అని వ్యవహరిస్తున్నాము. మానవసమాజ చరిత్రలో యింతవరకు స్థూలంగా ఐదురకాల

ఉత్పత్తి విధానాలు వివిధ దశలలో ఉంటూవచ్చాయి. ఆదిమ కమ్యూనిజం, బానిసవిధానం, భూస్వామ్యవిధానం, పెట్టుబడి దారీవిధానము, సోషలిజము. ఈ ఐదుదశల పరిణామక్రమాన్ని మనం "వర్గపోరాటం" అధ్యాయంలో తెలుసుకుందాము.

చారిత్రక భౌతికవాద సిద్ధాంతాన్ని వివరిస్తూ మార్క్స ఇలా వ్రాశాడు:

."మానవులు సాగించే సామాజిక ఉత్పత్తిలో వారి ఇష్టాఇష్టాలతో ప్రమేయంలేకుండానే తప్పనిసరియగు, ఖచ్చిత మగు సంబంధాలను ఏర్పరచుకొంటున్నారు. ఈ ఉత్పత్తి సంబంధాలు, వారి భౌతిక ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలో వచ్చిన నిర్దిష్ట దశను అనుసరించి ఉంటాయి. ఈ ఉత్పత్తి సంబంధాలమొత్తమే సమాజముయొక్క ఆర్థికకట్టడం. ఇదే నిజమగు పునాది. ఈ పునాదిపైననే, న్యాయశాస్త్ర సంబంధమైన, రాజకీయ సంబంధ మైన అంతస్తులన్నీ నిర్మింపబడతాయి. దీని కనుగుణ్యంగానే సామాజిక చైతన్యంయొక్క ప్రత్యేక రూపాలు ఏర్పడతాయి. భౌతికజీవితంయొక్క ఉత్పత్తి పద్ధతియే జనరల్‌గా జీవితం యొక్క సాంఘిక, రాజకీయ, ఆలోచనాక్రమము లన్నింటినీ నిర్ణయిస్తుంది. మానవుల అస్తిత్వాన్ని నిర్ణయించేది వారిచైతన్యం కాదు. వారి సామాజిక జీవితమే, వారిచైతన్యాన్ని నిర్ణ యిస్తుంది."

(మార్క్స - అర్థశాస్త్ర విమర్శకు వ్రాసిన ఉపోద్ఘాతం నుండి).

చారిత్రక భౌతికవాద సూత్రాలను అతిస్పష్టంగా, ప్రతిభా వంతంగా మార్క్స పైమాటలలో వివరించాడు. ఒక్క

ఉదాహరణనుచూస్తే పై సూత్రీకరణం ఎలా సరియైనదో మనకు బోధపడుతుంది.

ఈనాడు సోవియటు రష్యాలో సోషలిస్టు ఆర్థికసంబంధాలున్నాయి. లాభంకొరకు ఉత్పత్తిచేయాలి అనే పెట్టుబడిదారీ సమాజ ఉత్పత్తిసూత్రం అక్కడ పనిచేయడంలేదు. ప్రజల అవసరాల కనుగుణ్యంగా ఉత్పత్తి అనే సూత్రం సోవియటు రష్యాలో అమలులో ఉన్నది. నిరుద్యోగులు లేరు. ప్రజల జీవితప్రమాణం రోజురోజుకూ పెరుగుతున్నది.

కార్మికులు, రైతులు, మేధావులు, విద్యావేత్తలు - అందరూ సమాజోత్పత్తిలో భాగస్వాములు. ఫలితాన్నికూడా వారివారి శ్రమ ననుసరించి వారు అనుభవిస్తున్నారు. ఇక్కడ వర్గదోపిడీ లేదు. పెట్టుబడిదారీవర్గం లేదు. మార్కెట్లకొరకు విదేశాలను ఆక్రమించుకోవలెననే సామ్రాజ్యవాద శక్తులు లేవు.

ఈ ఆర్థికసంబంధాల కనుగుణ్యంగానే అక్కడ రాజకీయ వ్యవస్థకూడావుంది.

ఇందుకు అనుగుణ్యంగానే అక్కడ ప్రజా చైతన్యంలో కూడా మార్పువచ్చింది. విదేశ మార్కెట్లను కోరే సామ్రాజ్యవాద శక్తులు లేవు గనుక, సోవియటు ప్రభుత్వం, ప్రజలు సుస్థిరమైన ప్రపంచ శాంతిని వాంఛిస్తున్నారు. యుద్ధాన్ని ప్రేరేపించే సామ్రాజ్యవాదుల యత్నాలను ప్రతిఘటిస్తున్నారు. సోవియటు ప్రభుత్వ బడ్జెటులో రక్షణవ్యయానికి కేటాయించిన 18% ధనమే యిందులకు నిదర్శనం. ఏ దేశంలోని ప్రజలకంటె కూడా ఎక్కువగా సోవియటు ప్రజలు శాంతిని వాంఛిస్తున్నారనీ,

సోవియటు ప్రభుత్వ విదేశాంగ విధానము నిజమైన శాంతి విధానమనీ, ఆ దేశం వెళ్ళివచ్చిన అనేకులు పెద్దలు వెలిబుచ్చిన అభిప్రాయాలను మనం గమనిస్తున్నాము. సోవియటు ప్రజల శాంతివాంఛ, వారి చిత్రకళ, సినిమాలు, సాహిత్యం, నాట్యం అన్నిటిలోనూ ప్రతిబింబిస్తున్నది.

ఆర్థికసంబంధాల కనుగుణ్యమైన రాజకీయవ్యవస్థ, అందు కనుగుణ్యంగా ఏర్పడిన సామాజిక చైతన్యం – ఈ పరస్పర సంబంధానికి ఇంతకంటె చక్కటి ఉదాహరణ వేరే లేదు.

పైదానికి పోటీగా అమెరికా ఉదహరణ చూద్దాం. అమెరికా సామ్రాజ్యవాద దేశము. ఒకవైపున అర్బుదాలు గడించిన కోటీశ్వరులు, మరొకవైపున రోజురోజుకు పెరుగుతున్న నిరుద్యోగుల సంఖ్య. పేరుకుమాత్రం ఎన్నికలు, ఓటు హక్కు. కాని భావస్వాతంత్ర్యాన్ని అరికట్టి ప్రజాస్వామ్యవాదులను వేటాడుతున్న స్టెటుబడిదారీ 'ప్రజాస్వామ్యం' యుద్ధబడ్జెటులో 80% కంటె ఎక్కువ యుద్ధవ్యయానికి కేటాయింపు జరుగుతున్నది. ప్రపంచయుద్ధానికి అమెరికా సామ్రాజ్యవాదుల తహతహ పాఠకులందరికీ సుస్పష్టమే.

వారి సినిమా, చిత్రకళ, సాహిత్యాలలోకూడా యుద్ధవాంఛ, హత్యలు, దోపిడీలు, మానభంగాలు – జుగుప్సాకరమైన నైతికజీవితము – ఇవన్నీ మనం చూస్తున్నాము.

ఆర్థిక సంబంధాల కనుగుణ్యమైన రాజకీయ వ్యవస్థ, అందు కనుగుణ్యమైన సామాజిక చైతన్యం అనే సూత్రానికి ఇది మరొక ఉదాహరణ.

గత చరిత్రలోకి వెళ్ళితే ఇలాంటి ఉదాహరణలను ఎన్నైనా మనం చూడవచ్చు.

కనుక మానవసమాజ చరిత్రను వివిధ దశలుగా విభజించవచ్చునని, ఒక్కొక్క దశలోని ఆర్థికవిధానం, ఆ దశలోని రాజకీయ, సాంఘిక విధానాలకు, సామాజిక చైతన్యానికి మూలమనీ మనం తెలుసుకున్నాము.

అయితే ఒక దశలోనుండి మరొక దశలోనికి సమాజం మారటానికిగల కారణమేమిటి? అనే ప్రశ్న ఉండనేఉంది. ఈ అతిముఖ్యమైన ప్రశ్నకుకూడా చారిత్రక భౌతికవాదం సమాధానం ఇస్తున్నది.

# 3. సమాజ పరిణామానికిగల మూలకారణములు

ప్రపంచంలో ప్రతిదీ నిరంతరం మార్పు చెందుతున్నదనీ, ఈ మార్పు కొన్ని నిర్ణీతసూత్రాల కనుగుణ్యంగా జరుగుతున్నదనీ మార్క్సిజం తెలియజేస్తున్నది. మార్పుకు సంబంధించిన ఈ సాధారణ సూత్రాలను గతితార్కిక సూత్రాలు అని అంటాము.

భౌతికవాద దృక్పథము, గతితార్కిక పరిశీలనాపద్ధతి— ఈ రెండూ కలిసి గతితార్కిక భౌతికవాదము అని అంటాము.

ఒక సమస్యను గురించి మొదట స్థూలంగా ఒక దృక్పథాన్ని కలిగించుకోవాలి. ఆ తర్వాత ఆ సమస్యయొక్క పుట్టుపూర్వోత్తరాలను పరిశీలించాలి.

స్థూలంగా దృక్పథాన్ని ఏర్పరచుకునేటప్పుడు, ఆ సమస్యకు పునాది ఏది, కట్టడము ఏది అని నిర్ణయించుకోవాలి. ప్రధాన ప్రాతిపదిక ఏది, ఆ పునాదిపై ఉద్భవించిన ఉపాంగాలు ఏవి అని తేల్చుకోవాలి. ఇందుకు భౌతికవాద దృక్పథమే సరియైనది.

అటుతర్వాత, ఆ పునాదిని మనం దీర్ఘంగా పరిశీలించటం ప్రారంభిస్తాము. ఆ పునాది ఎలా ఏర్పడ్డది, అంతకుముందు ఏమి ఉండేది, అందులోనుంచి యిది ఎలా పుట్టింది ?

ఈపునాది మారుతున్నదా, లేదా,మారుతున్నట్లయితే అందుకుగల కారణాలేమిటి; మొదలైనవిషయాలను సూక్ష్మంగా వివరంగా పరిశీలించాలి. ఇలాపరిశీలించవలసివచ్చినపుడు మనం గతితార్కిక సూత్రాలను ఉపయోగించవలసి ఉంటుంది. ఇదే విధంగా పునాదిపైన నిర్మించబడ్డ కట్టడాలను (Items of superstructure) కూడ పరిశీలించవలసి ఉంటుంది.

భౌతికవాద దృక్పథానికి, గతితార్కిక పరిశీలనాపద్ధతికి గల ఈ అన్యోన్యసంబంధాన్ని మనం గమనించవలసి ఉంటుంది.

స్టాలిన్ ఇలా అన్నాడు:

"సమాజ జీవితమందలి వివిధదృగ్విషయాలకూ (Phenomena), సమాజంయొక్క, దానిచరిత్రయొక్క పఠనానికి గతి తార్కిక భౌతికవాద సూత్రాలను ఉపయోగించటమే చారిత్రక భౌతికవాదం". (గతితార్కిక చారిత్రక భౌతికవాదం.)

ప్రధానమైన గతితార్కిక సూత్రాలు ఇవి:

1. ఒక ఘటనను, లేక ఒకదశను పరిశీలించేటప్పుడు, ఆ ఘటనకు, లేక దశకు అంతకుపూర్వమున్న ఘటనలకు, లేక దశలకు గల అన్యోన్య సంబంధాన్ని గుర్తించాలి.

2. ప్రతి ఘటనకూ, దశకూ, నిరంతరం చలనం ఉన్నది. పుట్టుక, పెరుగుదల, నశింపు అనేవి ఉన్నవి. అనగా భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలున్నవి. కనుక ప్రతి క్షణమూ, భవిష్యత్కాలానికి సంబంధించిన ఏదో ఒక నూతనశక్తి మనకళ్ళ ఎదుట పుడుతూనే ఉంటుంది. భూతకాలానికి చెందిన ఒక ప్రతీపశక్తి అనుక్షణమూ నశిస్తూనేఉంటుంది. పాతసమాజంలో నుండే నూతనసమాజం ఆవిర్భవిస్తుంది.

3. ఈ నిరంతర చలనానికి, ఆ ఘటనలో లేక ఆ దశలో యిమిడివున్న ఆంతరంగిక వైరుధ్యాలే (Internal contradi-ctions) మూలకారణాలు.

4. ఈ మార్పులు యెల్లకాలం శాంతంగా, నిదానంగా, పరిమాణాత్మకంగా జరగక అపుడపుడు, ఆకస్మికమైన, త్వరిత గతిని జరిగే గుణాత్మక మార్పులు (Quantitative changes leading to Qualitative changes) గా కూడా ఉంటాయి.

5. అభివృద్ధికరమైన మార్పులు ఎల్లప్పుడూ ముక్కుకు సూటిగా, నిచ్చెనఎక్కినట్లు, మెట్టుమీదమెట్టుగా జరగవు. నత్తగుల్ల ఆకారంలో ఈ అభివృద్ధి సాగుతూ ఉంటుంది. అంతేగాదు; ఒక్కొక్కప్పుడు మానవుడు సాధించిన విజయాలు, పొందిన అభివృద్ధి, యుద్ధాలు, అంతఃకలహాలు, తదితర కారణాలవల్ల నశించటం, తిరిగి నాగరికతపునాదినుండి నిర్మాణం ప్రారంభించటం కూడా జరుగుతూవచ్చింది. విరోధవైరుధ్యం (Negation of Negation) అను పైసూత్రం కూడా గతితార్కికసూత్రంలో ఒకటి.

పైసూత్రాలను చరిత్రకు అన్వయింపచేసి పరిశీలించుదాం.

1. వివిధ దశలుగా సమాజం పురోగమిస్తున్నది. ఒక దశను మనం పరిశీలించి దాని మంచిచెడ్డలను అంచనావేయాలంటే, అంతకుపూర్వం ఉన్న దశ ఏది, అందులోనుండి ఇది ఎలా వచ్చింది అనే దృష్టితోనే పరిశీలించవలసి ఉంటుంది. అంతేగాని ఈనాటి నైతికసూత్రాలదృష్ట్యా, లేక 'శాశ్వత సత్యాలు', 'మానవధర్మాలు' అను వాని దృష్ట్యా పరిశీలించరాదు. నేటి దృష్టితో చూచినప్పుడు బానిసవిధానం అతి నికృష్టమైనదీ, హేయమైనదీ. కాని ఆదిమ కమ్యూనిస్టు వ్యవస్థతో పోల్చిచూచినప్పుడు అది ఒక అభివృద్ధిచిహ్నం. ఆదిమ కమ్యూనిజంలో మానవులకు వ్యవసాయం తెలియదు. ఆహార పదార్థాలకొరత ఉండేది. కనుక తెగలలోని వృద్ధులను, అవయవదార్ఢ్యంలేని పిల్లలను చంపివేసే ఆచారాలు ఆ దశలో ఉండేవి. తెగలమధ్య జరిగే యుద్ధాలలో ఓడిపోయినవారిని గెలిచినవారు నిశ్శేషంగా నాశనంచేసేవారు.

బానిసవిధానంలో మానవుడు వ్యవసాయం నేర్చుకున్నాడు. తానింత కడుపునిండాతిని, ఓడిపోయినవారికికూడా ఇంతపెట్టి వారిని బానిసలుగాచేసి పనిచేయించుకోవటం సాధ్యమైంది.

నాగరికతకు అత్యంత ప్రధానమైన వ్యవసాయాన్ని మానవుడు అలవరచుకొనుట బానిసవిధానంలోనే సాధ్యమైంది అన్న విషయాన్ని గమనించినట్లైతే, బానిసవిధానం, ఆదిమ

కమ్యూనిజంకంటే ఉన్నతస్థాయికి చెందిన దశ అని మనం గ్రహించగలము.

కనుక ప్రతిదానిని అంతకుముందున్న దానితోపోల్చి దాని మంచి చెడ్డలను అంచనా వేయవలసి ఉంటుంది. బాహ్యపరిస్థితులకు, ఒక ఘటనకుగల అన్యోన్య సంబంధాన్ని గమనించటం అంటే ఇదే!

2. పెట్టుబడిదారీ విధానంలోనుండే సోషలిజం పుట్టుకు వచ్చింది. ఈనాడు ప్రపంచంలోని మూడవవంతు జనాభా పెట్టుబడిదారీ సంకెళ్ళనుండి బైటపడి ముందుకు పురోగమిస్తున్నారు. ప్రపంచకమ్యూనిజం దిగ్విజయంగా జైత్రయాత్ర సాగిస్తున్నది. ఇది మనమందరమూ గుర్తిస్తున్నాము.

ఈ విషయాన్ని నూరు సంవత్సరాల క్రితమే 1848 లో కమ్యూనిస్టు కరపత్రంలో మార్క్స్ ఇలా వ్రాశాడు:

"కమ్యూనిజం అనే ఒక మహాశక్తి యూరపు అంతటా ఆవిర్భవిస్తున్నది. దేశదేశాలలోని నిరంకుశ పరిపాలకులు ఈ మహాశక్తిని చూసి భయపడుతున్నారు. దీనిని అణచివేసి తమ దోపిడీని చిరస్థాయి చేసుకోవలెనని చూస్తున్నారు. కాని పెట్టుబడిదారీ విధానం నశించక తప్పదు. కమ్యూనిజం జయించక తప్పదు."

భవిష్యత్తులోకి తొంగిచూచి మార్క్స్ మహాశయుడు నూరు సంవత్సరాల తర్వాత జరగబోయే ఈ విషయాలను ఎలా చెప్పగలిగాడు. సమకాలిక యూరపు ఆర్థికవ్యవస్థను, ఆయన పరిశీలించాడు. పెట్టుబడిదారీ గమనసూత్రాలను అధ్యయనం చేశాడు. అది తాత్కాలికంగా బలంగా ఉన్నప్పటికి

దాని వినాశనము తప్పదని గుర్తించాడు. భవిష్యత్సమాజ నిర్మాతమైన కార్మికవర్గం, పెట్టుబడిదారీ సమాజ గర్భంలో నుండే పుట్టుకువస్తున్నదని చూశాడు.

ఈ గతితార్కిక పరిశీలనా ఫలితంగానే మార్క్స ప్రతిభావంతమైన పై సూత్రీకరణచేసి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ జనకుడుగా గుర్తించబడ్డాడు. అనుక్షణమూ ఒక కొత్తశక్తి ఆవిర్భవిస్తూ ఉంటుందని, ఒక ప్రతీపశక్తి నశిస్తూ ఉంటుందని చెప్పడానికి ఇదే చక్కని ఉదాహరణ.

3. మార్పుకు మూలకారణం, ఆఘటనలో ఇమిడి ఉన్న ఆంతరంగిక వైరుధ్యాలేనని తెలుసుకున్నాము. ఒక దశనుండి మరొక దశకు సమాజం మారటానికి గల మూలకారణాలు ఆ దశకు చెందిన ఆర్థికవిధానంలోనే ఇమిడిఉన్నవి.

ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు - ఈ రెండూ కలిసి, ఉత్పత్తివిధానం ఔతుంది. ఇందులో ఉత్పత్తిశక్తులలో పనిముట్లు ప్రధానభాగం. ఇవి నిరంతరం అభివృద్ధిచెందుతూ వచ్చినవి. రాళ్ళు, యీటెలు, బల్లెము, చేపలుపట్టే వల, కత్తులు, భూమినిదున్నే నాగలి, ఇతర వ్యవసాయ పరికరాలు, రాట్నము, మగ్గం, కమ్మరికొలిమి, కుమ్మరిఆవం, వడ్రంగివాడే ఉలి, బాడిశె - మొదలుకొని ఆధునికయుగంలో మనం వాడుతున్న అత్యంత సున్నితమైన పరికరాలవరకు పనిముట్లు అభివృద్ధి చెందుతూ వచ్చాయి.

ఈ ఉత్పత్తి శక్తుల పెరుగుదలకు అనుగుణ్యంగా ఉత్పత్తి సంబంధాలుకూడా మారుతూ వచ్చినవి. మొదట్లో సమష్టిగా అందరూ ఒకేపనిని చేసే ఆదిమ తెగలలో క్రమంగా పని

విభజన ఏర్పడ్డది. దాంతో వారి ఉత్పత్తి సంబంధాలలో కొంత మార్పు వచ్చింది. ఒకే పనిని ఏండ్ల తరబడి చేయటంవల్ల ఆపనిలో ప్రావీణ్యత సంపాదించ గలిగారు. ఆ ప్రావిణ్యతను తమ సంతానానికి నేర్పేవారు. వ్యవసాయంకూడా చేతనైన తర్వాత గణయుద్ధాలలో గెల్చినవారు ఓడినవారిని బానిసలుగా చేసుకో సాగారు. బానిస, బానిస యజమాని అనే నూతన ఉత్పత్తి సంబంధాలు ఏర్పడ్డవి.

ఉత్పత్తిశక్తుల పెరుగుదల కనుగుణ్యంగా ఉత్పత్తి సంబం ధాలుకూడా తప్పనిసరిగా మారుతాయి. అయితే ఈ మార్పు జరిగేలోగా, కొత్త ఉత్పత్తి శక్తులకు, పాతఉత్పత్తి సంబంధాలకు మధ్య తీవ్రఘర్షణ జరుగుతూ వచ్చింది.

ఆదిమ కమ్యూనిస్టుదశలో అతి ప్రాథమికమైన రాతి పనిముట్లు, కొయ్యపనిముట్లు లేక లోహపు పనిముట్లు వాడే దశలో, గుంపులు గుంపులుగా మానవులు వేటాడేవారు. నాటి ఉత్పత్తిశక్తులస్థాయిలో ఆ పద్ధతి అనివార్యం. క్రూరజంతువుల బారినుండి రక్షించుకోటానికి ఆ సమష్టి ఆహారసంపాదనాపద్ధతి అత్యవసరం.

కాని ఇదే పద్ధతి, వ్యవసాయం అభివృద్ధికావటంతో, ఉత్పత్తిశక్తుల పెరుగుదలకు ఆటంకంగా తయారైంది. అందరూ ఒకేపనిని చేస్తూఉంటే వ్యవసాయం జరగదు. అభివృద్ధికాదు. వేటాడేవారు, పశువులను పోషించేవారు, పలందున్ని పంట లను పండించేవారు, రాత్రుళ్ళు పొలాలాకు కాపలాకాసే వారు, ధాన్యాన్ని ఇంటికి తెచ్చిన మీదట దానిని వండి ఆహారం తయారుచేసేవారు – ఇలాగా అనంతమైన పని

విభజన జరుగుతూవచ్చింది- పని విభజన అను మాటలోనే సమష్టిపద్ధతియొక్క నాశనము ఉంది. పని విభజనే సమాజంలో వర్గాలు ఏర్పడడానికికూడ మూలకారణం. కాని పని విభజన లేనిదే నేర్పరితనము, నైపుణ్యమురావు. అవి లేనిదే వ్యవసాయం అభివృద్ధి అయ్యేదేకాదు. వ్యవసాయం లేనిదే మానవ నాగరికతే లేదు.

కనుక ప్రాథమిక దశలో ఉత్పత్తిశక్తుల పెంపకానికి ప్రోత్సాహకరమైన సమష్టి ఉత్పత్తి సంబంధాలు, వ్యవసాయం అభివృద్ధికాగానే, వాటికి ఆటంకంగా పరిణమించినవి. కనుకనే ఆ పద్ధతులు నశించక తప్పలేదు. నశించినవి.

ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు గల ఈ ఘర్షణే ఆ సమాజ ఆర్థికవిధానంలో ఇమిడిఉన్న ఆంతరంగిక వైరుధ్యం. ఆంతరంగిక వైరుధ్యాల మధ్య జరిగే యీ ఘర్షణ సమాజ పురోభివృద్ధికి మూలకారణం. ఇదే చరిత్రగమనాని ప్రేరణశక్తి.

ఈ విషయాన్ని మార్క్స ఈక్రిందివిధంగా వివరించాడు:

"సమాజంయొక్క భౌతిక ఉత్పత్తిశక్తులు వాని అభివృద్ధి క్రమంలో ఒకానొక దశలో నాటికి స్థిరపడిఉన్న ఉత్పత్తి సంబంధాలతో, అనగా ఆస్తిసంబంధాలతో ఘర్షణపడతాయి. ఈ ఉత్పత్తి సంబంధాలు, ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి దోహద మివ్వకపోగా సంకెళ్ళుగా తయారౌతాయి. అప్పుడే సామాజిక విప్లవం ముందుకు వస్తుంది" (మార్క్స, అర్థశాస్త్ర విమర్శ-ఉపోద్ఘాతంనుంచి).

ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల ఘర్షణ సమాజ పరిణామానికి మూలకారణమని తెలుసుకున్నాము.

# 4. వర్గపోరాటం

ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తిసంబంధాలకు మధ్యజరిగిన ఘర్షణ అంటే, నూతనమైన ఉత్పత్తి శక్తులను అభివృద్ధిచేయటానికి పూనుకునేవర్గాలకు, పాత ఉత్పత్తి సంబంధాలను కాపాడటానికి పూనుకునే వర్గాలకు మధ్యజరిగే ఘర్షణ. దీనినే వర్గపోరాటము అని అంటున్నాము.

మానవుల మధ్యగల ఉత్పత్తి సంబంధాలను వర్గ సంబంధాలు అని అంటాము. పెట్టుబడిదారులు, కార్మికులు, భూస్వాములు, రైతులు, బానిస యజమానులు, బానిసలు – ఇవి వివిధ దశలలోని ప్రధాన వర్గసంబంధాల్లు.

బానిస విధానం ప్రారంభం కావటంతోనే వర్గపోరాటం ప్రారంభమైంది. వ్యవసాయాన్ని నేర్చుకున్న కొన్ని తెగలు, ఇతర తెగలను ఓడించి, వారిని బానిసలుగా చేసుకోసాగాయి. ఒక తెగను ఓడించి ఆ తెగవారిని బానిసలుగా చేసుకునేందుకు ఘోరమైన యుద్ధాలు జరిగేవి. అంతర్వాత బానిసలు వీలు దొరికినప్పుడల్లా తిరుగుబాట్లు చేసేవారు. లేదా పారిపోయేవారు.

ఇంతేకాదు. బానిస యజమానులకంటె బానిసలు ఎల్లప్పుడూ సంఖ్యలోబహుళంగానే ఉండేవారు. బానిసవిధానం అత్యున్నత స్థాయినందుకున్న గ్రీసుదేశంలో క్రీ. పూ. 500, 600 ప్రాంతాల్లలో ప్రతి వేయిమంది స్వతంత్రపౌరులకు, 5, 6 వేల మంది బానిసలు అనే నిష్పత్తిలో జనాభా ఉండేది. అధిక సంఖ్యాకులైన ఈ బానిసలను తమ అదుపులో పెట్టుకునేందుకు బానిస యజమానులు పటిష్ఠమైన రాజ్యాంగ యంత్రాన్ని,

క్రూరమైన న్యాయచట్టాన్ని, దోపిడీని సమర్థించే తత్వశాస్త్రాన్ని సృష్టించుకున్నారు.

ఇన్ని జరిగినా యూరప్‌లో బానిసవిధానం 5, 6 వందల సంవత్సరాలకంటే ఎక్కువకాలం నిలవలేదు. బానిసల తిరుగుబాట్లు ఒకవైపున, ఇంకా ఆదిమ కమ్యూనిజంలో నివసిస్తున్న తెగల దండయాత్రలు మరొకవైపున గ్రీసు, రోమను, బానిస సామ్రాజ్యాలను ధ్వంసంచేసినవి.

నాటినుండీ నేటివరకూగల చరిత్రఅంతా ఒకే సత్యాన్ని బోధిస్తున్నది. ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య జరిగిన ఘర్షణ వర్గపోరాటాల చరిత్రతప్ప వేరుకాదు. ఇదే చరిత్ర గమనానికి చోదకశక్తి.

కమ్యూనిస్టు ప్రణాళిక ప్రారంభ వాక్యాలలోనే ఈ నగ్నసత్యాన్ని మార్క్స్ వివరించాడు :

"ఇంతవరకూ జరిగిన మానవసమాజచరిత్ర యావత్తూ (ఆదిమ కమ్యూనిజం మినహా) వర్గ పోరాటాల చరిత్రమే. స్వతంత్రుడు, బానిస, సామంతుడు-సామాన్యుడు, ప్రభువు-అర్థబానిస, వృత్తి యజమాని-వృత్తిపనివాడు ఒక్కమాటలో చెప్పాలంటే పీడించేవారు, పీడింపబడేవారు ఒకరిపై ఒకరు ఎడతెగని పోరాటాలు సాగిస్తూవచ్చారు. ఈ పోరాటం ఒకప్పుడు బహిరంగంగాను, ఒకప్పుడు పైకి కనపడకుండాను జరిగేవి. వాటి పర్యవసానంగా, ప్రతిసారి సామాజిక వ్యవస్థ విప్లవ పంథాలో పునర్నిర్మించబడటమో లేక ఆ వర్గాలు నశించిపోవడమో జరిగేది."

(మార్క్స్-కమ్యూనిస్టు ప్రణాళిక)

"వర్గపోరాటమే చరిత్రకు చోదకశక్తి" అని కూడా మార్క్స్ మరొక సందర్భంలో వివరించాడు.

ఒకదశనుండి మరొకదశకు సమాజం మార్పుచెందినప్పుడల్లా విప్లవాలద్వారానే అది సాధ్యమైందని గత చరిత్రే రుజువుచేస్తున్నది. బానిసల తిరుగుబాట్లు బానిసవిధాన పతనానికి మూలకారణం. అటుతర్వాత భూస్వామ్య విధానం వచ్చింది. అందులో భూస్వామ్యవర్గానికి, అప్పుడప్పుడే తలఎత్తుతున్న వ్యాపారవర్గానికి ఘర్షణ ప్రారంభమైంది. ఈవ్యాపారవర్గమే కొంతకాలానికి పారిశ్రామికబూర్జువావర్గంగా తయారై భూస్వామ్యవిధానంమీద విప్లవాలు సాగించింది. 17వ శతాబ్దంలో బ్రిటన్‌లో ఆలివర్ క్రామ్‌వెల్ నాయకత్వాన జరిగిన తిరుగుబాటు, 1789 లో జరిగిన ఫ్రెంచి మహావిప్లవం, 19 వ శతాబ్దప్రారంభంలో జర్మనీలో జరిగిన తిరుగుబాటు —ఇవన్నీకూడా బూర్జువావర్గం భూస్వామ్యవిధానంపైన చేసిన విప్లవాలు. ఈ విప్లవాలలో రైతాంగసైతం బూర్జువావర్గాన్ని బలపరచటం జరిగింది.

పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిస్టు సమాజానికి జరిగే పరిణామంకూడా విప్లవాలద్వారానే జరుగుతున్నదని సమకాలికచరిత్రయే రుజువుచేస్తున్నది. 1917 లో రష్యాలో జరిగిన కార్మిక విప్లవము సోషలిస్టు సమాజస్థాపనకు శంఖారావమైంది. విదేశీ సామ్రాజ్యవాదానికి, దేశీయ భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా దీర్ఘకాలపోరాటం సాగించిన మీదటనే, చైనాలో నూతన ప్రజాతంత్ర ప్రభుత్వస్థాపన సాధ్యమైంది. ఎర్రసైన్యం సహాయంతో, రెండవ ప్రపంచ యుద్ధానంతరం

తూర్పు యూరపు దేశాలలో జరిగిన విప్లవాలఫలితంగానే ఆ దేశాలలో నూతన ప్రజాతంత్ర వ్యవస్థ స్థాపించబడ్డది.

పరిమాణాత్మకమైన మార్పులు కొంతకాలం జరిగిన తర్వాత ఆకస్మికమైన త్వరితగతిని జరిగే, గుణాత్మక మార్పులుగా మారుతాయన్న గతితార్కిక సూత్రానికిదే చరిత్రలో ఉదాహరణ.

సమాజ పరిణామం, నిచ్చెన మెట్లవలె ముందుకు పోదని, అనేకమైన ఒడుదుడుకులు, వంకరటింకర మార్గాలగుండా పురోగమిస్తుందని, విరోధ నైరుధ్య (Negation of - negation) సూత్రానికనుగుణ్యంగా ఈ అభివృద్ధి జరుగుతుందని సమాజ చరిత్రకు సంబంధించిన అధ్యాయంలో వివరంగా చూడగలము.

వివిధ గతితార్కిక సూత్రాలను చరిత్రకు వర్తింపచేయుటద్వారా చారిత్రక భౌతికవాద సిద్ధాంతము ఏర్పడుతున్నదని, ఇదే సరియైన సిద్ధాంతమని ఇంతవరకూ సోదాహరణంగా తెలుసుకున్నాము.

## 5. ఆర్థిక పునాది - సామాజిక జీవితం

మరికొన్ని ముఖ్యసమస్యలను కూడా మనము చర్చించవలసిఉంది. ఆర్థిక విధానమనేపునాదిపై సామాజిక జీవితమంతా నిర్మించబడుతుందని, మానవసమాజచరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రయేనని కొన్ని సూత్రీకరణలు చేశాము. వీటి ప్రాధాన్యతను మరికొంత వివరంగా తెలుసుకుందాము.

ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో వర్గాలులేవు, స్వంత ఆస్తిలేదు, దోపిడీవిధానము లేదు. అతి ప్రాథమికమైన పని ముట్ల సహాయంతో ప్రజలు గుంపులు గుంపులుగా ఆహార సంపాదన సాగిస్తూ ఉండేవారు. ఇది నాటి ఉత్పత్తివిధానము.

ఈ ఆర్థిక విధానానికి అనుగుణ్యంగానే నాటి సమాజ జీవితమంతా ఉండేది. వర్గవిభేదాలు లేవు. కనుక రాజ్యాంగ వ్యవస్థ ఏర్పడలేదు. వివాహ వ్యవస్థకూడ ప్రారంభంలో అసలు లేదు. ఆదిమ కమ్యూనిస్టు సమాజపు ఆఖరి రోజులలో వివాహానికి సంబంధించిన కొన్ని నియమాలు ఏర్పడ్డవి. ప్రకృతికి సంబంధించిన పరిజ్ఞానము అతి స్వల్పంగా ఉండేది. కనుక ప్రతి చెట్టు, పుట్ట, రాయి, రప్ప.- చాటున ఏదో దైవికశక్తి ఉండి నడిపిస్తున్నదనే మూఢనమ్మకాలు జాస్తిగా ఉండేవి. ఇది ఆనాటి సామాజిక జీవితం.

బానిసవిధానం వచ్చింది. వర్గ విభేదాలు ఏర్పడ్డాయి. దోపిడిని రక్షించేందుకు రాజ్యాంగ యంత్రం ఒకటి అవసర మైంది. రాజు దైవాంశ సంభూతుడనే సిద్ధాంతం పుట్టింది. మానవులు జన్మతః కొందరు బానిసలుగాను, కొందరు బానిస యజమానులుగాను పుట్టారని గ్రీసులో అరిస్టాటిల్ అనే తత్వవేత్త అన్నాడు.

భారతదేశంలో కులవ్యవస్థ ఏర్పడ్డది. బ్రాహ్మణులు బ్రహ్మ ముఖంలోనుంచి పుట్టారనీ, క్షత్రియులు భుజాలనుండి, వైశ్యులు తొడలనుండి, శూద్రులు పాదాలనుండి జన్మించారనీ, కనుక మానవసమాజంలో వ్యత్యాసాలు దైవసృష్టిఅనీ, సహజ సిద్ధమనీ సిద్ధాంతాలు బయలుదేరాయి.

అంతేకాదు, బానిసవిధానంతో వ్యవసాయం, దాంతో అందుకు సంబంధించిన అనేక విజ్ఞాన శాస్త్రాలు, రేఖాగణితము, వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, భవననిర్మాణ శాస్త్రము, ఖగోళశాస్త్రము–మొదలైనవి ఏదోఒక రూపములో ప్రారంభమైనవి.

బానిసవిధానంలో నిరంకుశ రాచరిక వ్యవస్థ ఏర్పడ్డది. అర్ధబానిసవిధానంలో కూడా ఇదే వ్యవస్థ కొనసాగింది. కాని పెట్టుబడిదారీ విధానం రావటంతో పెద్దమార్పు వచ్చింది.

అర్ధబానిసవిధానంలోని రైతాంగాన్ని విముక్తి చేయనిదే బూర్జువావర్గానికి తమ పరిశ్రమలలో పనిచేసే కార్మికులు లభించరు; కనుక పెట్టుబడిదారీవర్గము స్వాతంత్ర్యము, సమానత్వము, సోదరత్వము అనే నినాదాలను లేవదీసింది. నిరంకుశ రాచరిక వ్యవస్థస్థానే పార్లమెంటు, ఎన్నికలు, ప్రజాస్వామ్యం-అనే నినాదాలు ప్రచారంలోకి వచ్చాయి. ఈ నినాదాలకు తన వర్గపరిమితులలోనే బూర్జువావర్గం భాష్యం చెపుతుంది. అయినప్పటికి నిరంకుశ రాచరిక వ్యవస్థ పెట్టుబడిదారీ ఆర్థిక విధానంతో నశించసాగింది.

కులభేదాల నిరసన, అస్పృశ్యతా నివారణ, స్త్రీపురుష సమానత్వము మొదలైన నినాదాలన్నీ పెట్టుబడిదారీ నాగరికతతోనే మన దేశంలో కూడా ప్రవేశించినవి.

కనుక ఆర్థికవిధానానికి అనుగుణ్యంగా రాజకీయ వ్యవస్థ, తదనుగుణ్యంగా సాంఘిక ఆచారాలు మారుతూ ఉంటాయని మనము గ్రహించగలము.

ఇంతేకాదు. ఆర్థికవిధానానికి, మానవుని భావప్రపంచానికి కూడా సన్నిహిత సంబంధ మున్నది. తత్వశాస్త్రము, నైతికదృష్టి, మతసంబంధమైన భావాలు, లలితకళలు, సాహిత్యం - మొదలైనవన్నీ మానవుని భావప్రపంచానికి సంబంధించినవి.

ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో ప్రజల జీవితాని కనుగుణ్యంగానే, దేవతలకు సంబంధించిన వారి భావాలు కూడా ఉండేవి. గుడ్డలు కట్టుకోవటంకూడా చేతగాక, బల్లెము, ఈటెలు పుచ్చుకుని అడవులలో తిరుగుతూ ఉండే ప్రజలు దేవుని కూడా తమవలెనే ఊహించుకొన్నారు. నాటి దేవత అయిన శివుడు పులితోలు కట్టుకొని, పాములను మెళ్ళో వేసుకొని, బల్లెం పుచ్చుకొని, మానవకపాలంలో భిక్షాటన చేస్తూ, స్మశానంలో కాపరం ఉండేవాడు. కొంతకాలానికి మానవులు పశుపోషణ నేర్చుకొని, శివునికి ఒకఎద్దును (నంది) వాహనంగా ఇచ్చారు.

భారతదేశంలో శైవమతం అతి ప్రాచీనమైనది. ఆదిమ కమ్యూనిస్టు జీవితవిధానంలో జీవించిన ప్రజల దైవసంబంధమైన భావాలకు శివుడు ప్రతిబింబం.

తర్వాత బానిస విధానం వచ్చింది. వ్యవసాయం, వ్యాపారం హెచ్చినవి. వెండి, బంగారం మొదలైన లోహాలను తవ్వి నగలు, నాణెములు చేయటంనేర్చుకున్నారు. సమాజంలో డబ్బు ప్రధానమైంది. డబ్బుగలవానికి అధికారం, గౌరవం, హోదా వచ్చినవి. ఆ దశలో బానిస యజమానుల దేవుడు శ్రీ మహావిష్ణువు. ఆయన నివాసం వైకుంఠం. లక్ష్మి (ధనం)

ఆయనభార్య. అటూ ఇటూ పారిపోకుండా లక్ష్మిని విష్ణువు వక్షస్థలంలో అతికించారు. బ్రహ్మదేవుడు బంగారాన్ని తన పొట్టలో దాచిపెట్టుకొని హిరణ్యగర్భుడైనాడు.

ఇలాంటి ఉదాహరణ లెన్నైనా యివ్వవచ్చు. ప్రజల మతసంబంధమైన భావాలకు, వారి ఆర్థిక జీవితానికి సన్నిహిత సంబంధముండేది. అంతేకాదు; వర్గసమాజం ఏర్పడ్డ తర్వాత ఒక్కొక్క వర్గానికి ఒక్కొక్క రకమైన వర్గదృక్పథము ఏర్పడి, ఆ దృక్పథము వారి మతవిశ్వాసాలు, తాత్విక దృక్పథం, నైతిక దృష్టి, కళలు, సాహిత్యము మొదలైనవాటిలోగూడా ప్రతిబింబిస్తూ వచ్చింది.

పెట్టుబడిదారీ నాగరికత 19 వ శతాబ్దంలో మన దేశంలో ప్రారంభమైంది. కులభేదాల నిరసన, స్త్రీ పురుష సమానత్వము మొదలైన భావాలు ఏర్పడ్డాయి. ఈ భావాలను ప్రచారం చేసి, ఆంధ్రదేశంలో బ్రహ్మాండమైన సంచలనం కలిగించిన వ్యక్తి కందుకూరి వీరేశలింగంగారు. తన ఉద్యమప్రచారానికి ఆయన సాహిత్యాన్ని ఒక సాధనగా ఉపయోగించాడు. వందలాది వచనగ్రంథాలను సామాన్యప్రజల కర్థమయ్యే పద్ధతిలో వ్రాయటానికి పూనుకున్నాడు. అంతేకాదు, ప్రజల సమస్యలను ప్రజల కర్థమయ్యేపద్ధతిలో వ్రాయటానికి పూనుకోవటంతో తెలుగు సాహిత్యముయొక్క స్వభావం (Content) లోనూ, స్వరూపం (form) లోనూ కూడా పెద్దవిప్లవం వచ్చింది.

కనుక ఆర్థికవిధానానికీ, సామాజిక జీవితానికీ, భావ ప్రపంచానికీ సన్నిహిత సంబంధ మున్నదనీ, ఆర్థికపునాది

మారిపోయినమీదట, దాంతోపాటు కట్టడములోని వివిధాంశాలుకూడా వెనకా ముందుగా మారకతప్పదనీ గ్రహించాము.

1. అయితే ఈ సూత్రీకరణను అర్థంచేసుకునేముందు మరికొన్ని వివరాలుకూడా గ్రహించాలి. ఆర్థికవిధానము మారి, కొత్త ఆర్థికవిధానము వచ్చినవెంటనే భావప్రపంచంలోని అంతస్తులు అన్నీ ఒకేసారిగా మారవు. చాలాకాలం వరకు నూతన ఆర్థికవ్యవస్థలోకూడా పాత సామాజిక వ్యవస్థ యొక్క చిహ్నలు, పాత భావప్రపంచంలోని అవశేషాలు అలాగే ఉంటాయి.

పెట్టుబడిదారీ నాగరికతలో భూస్వామ్య విధానంలో ఏర్పడ్డ మత ఛాందసాలు, భావాలు, తత్వశాస్త్రం అలాగే ఉండటం మనం చూస్తున్నాము. సోషలిస్టు ఆర్థిక విధానం స్థాపించబడిన రష్యాలో ప్రజానీకంలో ఇప్పటికీ అనేకులు మత భావాలుకలవారున్నారు. దీని అర్థమేమిటి? పునాదిఅయిన ఆర్థిక విధానం మారినవెంటనే, కట్టడంలోని మిగతా అంగాలన్నీ మారక మరి కొంతకాలం తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకునేటందుకు పెనుగులాడుతూనే ఉంటాయని దీని అర్థం.

ఇదే విషయాన్ని మార్క్స్ యిలా వివరించాడు:

"ఆర్థిక పునాదిలో మార్పు రావటంతో దానిపై నిర్మింపబడిన అంతస్తులన్నీ కొంచెం వెనకా, ముందుగా మార్పు చెందుతాయి. అయితే ఒక విషయాన్ని గుర్తించాలి. ఆర్థికవిధానంలో వచ్చే మార్పులను ప్రకృతి శాస్త్రములవలె ఖచ్చితంగా అంచనావేసి తెలుసుకోగలము. కాని భావప్రపంచంలో వచ్చే మార్పులను ఇలా తెలుసుకోలేము..........

కనుక భౌతికపరిస్థితులలో వచ్చేమార్పుకూ, భావప్రపంచంలో వచ్చే మార్పుకూ గల తేడాను గుర్తించాలి."

(మార్క్స్, అర్థశాస్త్ర విమర్శ - ఉపోద్ఘాతం నుంచి)

2. ఆర్థికపునాదిపై భావప్రపంచం ఆధారపడి ఉంటుందన్నమాత్రాన, సామాజిక జీవితంలోని, భావప్రపంచంలోని ప్రతి చిన్నవిషయానికి ఆర్థిక కారణాలుంటాయని భావించటం పొరపాటు.

సామాజిక జీవితం ఏర్పడ్డమీదట, దానికొక ప్రత్యేక అస్తిత్వము ఏర్పడుతుంది. ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు, సిద్ధాంతాలు, తత్వశాస్త్రాలు మొదలైనవి ఏర్పడి, అవి తిరిగి సమాజపరిణామంపైన ప్రభావాన్ని కలుగజేస్తాయి. మతఛాందస భావాలకు మూలం బానిస ఆర్థికవిధానం. ఈ మతఛాందస భావాలు బానిసవిధానం పడిపోకుండా చాలాకాలం కాపాడినవి. కొన్నివందల సంవత్సరాల పాటు సమాజపరిణామాన్ని ఆటంకపరచ గలిగినవి.

అదేవిధంగా విప్లవకర సిద్ధాంతాలు, సమాజపరిణామానికి ఎంతో ప్రోత్సాహమిచ్చినవి. సమానత్వము, స్వాతంత్ర్యము, స్వేచ్ఛ-అని 18 వ శతాబ్దంలో యూరపియన్ పెట్టుబడిదారీవర్గం లేవదీసిన శంఖారావం, భూస్వామ్యవిధాన పతనానికి, పెట్టుబడిదారీవిధాన ఆవిర్భావానికి ఎంతో సహాయపడ్డది. ప్రజాసామాన్యాన్ని ఉత్సాహపరచి, కదనరంగంలోకి దింపి, పాతసమాజాన్ని ధ్వంసం చేయగల ఉత్సాహాన్ని, పట్టుదలను, ధైర్యసాహసాలను వారికి గలిగించిన విప్లవ నినాదంగా

ఈ సిద్ధాంతం ఉపకరించింది. ఇదే విషయాన్ని మార్క్స్ ఇలా చెప్పాడు :

"ఒక సిద్ధాంతం ప్రజలలో నాటుకుపోయినమీదట, అది ఒక ప్రచండమగు భౌతికశక్తిగా పనిచేయుగలదు."

3. చారిత్రక భౌతికవాదానికి తప్పుడు వ్యాఖ్యానం చెప్పేవారు కొందరున్నారు. అన్నిటికీ ఆర్థిక కారణాలే మూలమని మార్క్సిజం చెపుతుందని కనుక ప్రతి చిన్న పనికి, వ్యక్తుల కార్యకలాపాలు, వారి జీవితవివరాలు మొదలైన వాటన్నిటికిసైతం మూలం ఆర్థిక కారణాలని వివరించటానికి ప్రయత్నిస్తారు. ఇది పూర్తిగా తప్పు. ఈ వక్రభాష్యాన్ని ఖండిస్తూ ఎంగెల్స్ ఇలా అన్నాడు :

"చారిత్రక భౌతికవాదదృష్ట్యా వాస్తవజీవితంలోని ఉత్పత్తి పునరుత్పత్తి క్రమమే చిట్టచివరకు చరిత్రను నిర్ణయించే శక్తి. నేనుగాని, మార్క్సుగాని చెప్పిన దింతమాత్రమే. దీనిని ఎవరైన సాగదీసి ఆర్థిక కారణం ఒక్కటే చరిత్రగతిని నిర్ణయిస్తున్నట్లు మేము చెప్పామని అంటే అది బుద్ధిహీనమైన ప్రకటనమాత్రమే అవుతుంది. ఆర్థిక పరిస్థితే పునాది. కాని దానిపైన ఉండే వివిధ అంతస్తులు వర్గపోరాటంయొక్క రాజకీయ రూపాలు, దాని ఫలితాలు, విజయానంతరం జయించిన వర్గం ఏర్పరిచే శాసనాలు, న్యాయశాస్త్రముల రూపాలు ఈ వాస్తవిక పోరాటాల వల్ల పోరాడి వారి బుర్రలలో కలిగే ప్రతిబింబాలు, రాజకీయ, న్యాయశాస్త్ర సంబంధమైన తాత్విక సిద్ధాంతాలు, మత భావాలు, పిచ్చి నమ్మకాలు...ఇవన్నీకూడా చాలా సందర్భా

లలో వాటి రూపాలను నిర్ణయించుటలో ప్రాధాన్యత వహించ గలవు". (మార్క్స – ఎంగెల్స్ లేఖలు)

4. సమాజంలో జరిగే మార్పులకు మూలకారణం ఆర్థిక విధానంలో జరిగే మార్పులే. అయితే ఈ మార్పులకు కారణభూతులైన వ్యక్తులు, సిద్ధాంతాలు, తరుచు ఈవిషయాన్ని గుర్తించకపోవచ్చు. తామేవో కొన్ని ఆదర్శాలకొరకు పోరాడుతున్నట్లు వారు భావిస్తారు. నిజంగానే వారు పోరాడుతారు. అయితే వారి ఉద్దేశాలు ఒకటైతే వారు సాగించిన ఉద్యమాల ఫలితాలుమాత్రం వేరువేరుగా ఉండవచ్చు.

15 వ శతాబ్దంలో జర్మనీలో మార్టిన్ లూథర్ అను మతప్రచారకుడు బయలుదేరి కాథలికు మతంలోని మూఢ సిద్ధాంతాలపై తిరుగుబాటుగా, ప్రాటెస్టెంటు మతాన్ని ప్రారంభించాడు. కాథలిక్ మత ఛాందసాలకు వ్యతిరేకంగా ప్రారంభమైన ఈ నూతనమతం, స్వేచ్ఛాఆలోచనకు అంకురం వేసింది. పోపుమతాధికారి నిరంకుశపెత్తనంపై దెబ్బతీసింది. దాంతో యూరపులో భౌతిక విజ్ఞానశాస్త్రాభివృద్ధి ప్రారంభమైంది. ఆతర్వాత వందసంవత్సరాలకు తలయెత్తిన పెట్టుబడిదారీవర్గం, ఈ విజ్ఞానశాస్త్రాలను వినియోగించుకొని యంత్ర నాగరికతను ప్రారంభించింది.

1636 లో ఇంగ్లాండులో నిరంకుశ చక్రవర్తి ఐన ఒకటవ ఛార్లెస్‌పై తిరుగుబాటుచేసి, అతని శిరచ్ఛేదనంచేసి, రిపబ్లికను స్థాపించిన ఆలివర్ క్రామ్‌వెల్, తాను నిరంకుశత్వాన్ని నాశనం చేస్తున్నానని మాత్రమే భావించేడు. నిజానికి, క్రామ్‌వెల్ విప్లవం భూస్వామ్యవిధానానికి ఇంగ్లం

డులో చావుదెబ్బతీసింది. పెట్టుబడిదారీవర్గం పైకి రావటానికి సహాయపడ్డది. కనుకనే మనం ఆ విప్లవాన్ని బూర్జువావిప్లవం అని అంటున్నాము.

క్రామ్‌వెల్‌మాత్రం తాను ప్యూరిటన్ మతస్థుల తరఫున కాథలిక్ మతస్థుడైన రాజుతో పోరాడుతున్నానని మాత్రమే భావించి ఉండవచ్చు. ఇదే విషయాన్ని మార్క్స ఇలా వివరించాడు :

"ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తిసంబంధాలకూ మధ్య వచ్చే ఘర్షణను మానవుడు న్యాయశాస్త్ర సంబంధమైన రాజకీయ, మత, కళారూపాలలోనే అనగా ఒక్కమాటలో చెప్పాలంటే భావప్రపంచంలో, వివిధ భావరూపాలలో తెలుసుకుంటాడు. ఆ భావ ప్రపంచంలోనే మొదట పోరాటం సాగిస్తాడు."
(మార్క్స అర్థశాస్త్ర విమర్శ – ఉపోద్ఘాతమునుండి)

5. ఆర్థిక విధానంలోని మార్పులు మొత్తం సమాజ జీవితంలో జరిగే మార్పులకు పునాదివంటివని, ఈ ఆర్థిక విధానంలో జరిగే మార్పులకుకూడా కారణం ఉత్పత్తి శక్తుల నిరంతరాభివృద్ధియేనని మనం తెలుసుకున్నాము.

ఇంకా బండగా చెప్పదలచుకుంటే పనిముట్ల అభివృద్ధి చరిత్ర (History of tools) మానవ చరిత్రకు సూత్రము అని చెప్పినా తప్పులేదు.

"చేతిమర ఫ్యూడల్ ప్రభువు వున్న సమాజాన్ని తెచ్చి పెట్టింది. ఆవిరి మర పారిశ్రామిక పెట్టుబడిదారు వున్న సమాజాన్ని తెచ్చిపెట్టింది." (మార్క్స "పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ" నుండి)

ఐతే కొత్త పనిముట్లను కనిపెట్టేవ్యక్తులు లేక సంస్థలు, తాము నూతన సమాజాన్ని నిర్మిస్తున్నామని గాని, నిర్మించవలె నని గాని భావించరు. తమ తక్షణ ప్రయోజనాల దృష్ట్యా, పనిలో సౌలభ్యం, లేక అధికలాభం దృష్ట్యా వాటిని ప్రవేశ పెడతారు. ఆ పరిశోధనలఫలితాలు మాత్రము వారూహించిన దానికంటె భిన్నంగా ఉంటాయి. కనుక నూతన సమాజనిర్మాణానికి దోహదకరమైన ఉత్పత్తిశక్తులు పాత సమాజ గర్భం లోనే పుటుతాయని గ్రహించవలసి ఉంటుంది.

భారత దేశంలో ఈస్టు ఇండియా కంపెనీవారు మొదట్లో రైల్వేమార్గాలను నిర్మించినపుడు తమ సైన్యాలను దేశం నాలుగుమూలలకు తీసుకుపోవలెనని, దేశంలోని ముడి సరుకులను రేవుపట్టణాలకు చేరవేయవలెనని మాత్రమే వారి ఉద్దేశం. కాని రైల్వేల నిర్మాణంవల్ల వారి ఉద్దేశంకంటె భిన్నమైన ఫలితాలు కలిగినవి. రైల్వేలు, వానితోపాటు తంతి, తపాలా సౌకర్యాలు ఇవి భారత దేశాన్ని ఏకంచేసేందుకు ఉపయోగపడ్డాయి. రవాణాసౌకర్యాలు పెరిగిన మీదటనే రాకపోకలు హెచ్చి హిమాలయ పర్వతాలవద్దనుండి కన్యాకుమారివరకు గల ప్రజలందరిలోనూ, మనమంతా భారతీయులమనే చైతన్యం కలిగింది. ఇంతకుపూర్వంలేని పారిశ్రామిక కార్మిక వర్గం భారత దేశంలో అవతరించింది.

స్టాలిన్ ఇలా వ్రాస్తున్నాడు :

"ఎప్పుడైతే ఆదిమ కమ్యూనిస్టు సమాజంలోని కొందరు తడుములాడుకుంటూ క్రమంగా రాతి పనిముట్లనుండి లోహపు పనిముట్లను ఉపయోగించటం ప్రారంభించారో, అపుడు వారు

ఈ నూతన పనిముట్లు ఎట్టి సామాజిక ఫలితాలకు దారితీస్తాయో ఎరుగరు. తెలుసుకొనప్రయత్నించలేదు కూడా...తమశ్రమను తేలిక చేసుకోవటం అనే తక్షణ ఫలితాన్ని వారు కోరారు... తక్షణలాభమనే ఈ స్వల్ప పరిమితిలోనే వారి కార్యకలాపాలు ఉండిపోయినవి."

(స్టాలిన్ - గతితార్కిక చారిత్రక భౌతికవాదంనుండి)

కనుక మానవులు తమకు ఇష్టమున్నా, లేకపోయినా కొన్ని నిర్ణీతమైన ఉత్పత్తి సంబంధాలలోకి ప్రవేశించవలసి ఉంటుంది. తమ పూర్వీకులు అందజేసిన ఉత్పత్తిశక్తులను పునాదిగా చేసుకుని వాటిని తమకుపయోగపడేవిధంగా చేసుకుంటారు. ఈవిధంగా తమజీవితాన్ని మరింత సుఖవంతం చేసుకోవటానికి చేసే ప్రయత్నంలోనే భవిష్యత్సమాజ నిర్మాణానికి పునాది రాళ్ళు వేసినవారవుతారు.

పాత సమాజ గర్భంలోనుంచే నూతన సమాజం ఆవిర్భవిస్తుందని, ఇందుకు మానవకృషి అత్యవసరమని వివరిస్తూ స్టాలిన్ ఇలా అన్నాడు: "మానవుడు తన భవిష్యత్తును తానే నిర్మించుకుంటాడు. అయితే తనకు లభించిన వస్తుసామగ్రి సహాయంతోనే ఈ కృషి చేయగలడు (Man makes his own future but with the available material)."

పెట్టుబడిదారీ విధానం నశించి సోషలిజం ఎలాగో వస్తుందిగదా, కనుక దానికొరకు మనం కృషి చేయకపోతేనేమి అని వితండవాదం చేసేవారు కొందరున్నారు. వారికి స్టాలిన్ పైన చెప్పిన వాక్యాలే సమాధానము.

ఉత్పత్తిశక్తులలో మానవుడు ప్రధాన భాగస్వామి. మానవకృషి లేనిది ఉత్పత్తిపరికరాలు తమంతట తాము కదలవు. ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల ఘర్షణ సజీవమైన వర్గపోరాట మనేరూపంలో చరిత్రలో ప్రత్యక్షమౌతున్నది. జయప్రదంగా నడచిన అన్ని సామాజిక విప్లవాలకు, పాత సమాజంలో ఉద్భవించి నూతన సమాజ నిర్మాతమైన వర్గమే నాయకత్వం వహిస్తూవచ్చింది. భూస్వామ్య విధానంలో పుట్టిన బూర్జువావర్గం, బూర్జువా విప్లవాలకు నాయకత్వం వహించింది. బూర్జువా సమాజంలో పుట్టిన కార్మికవర్గం ఆ సమాజాన్ని ధ్వంసంచేసి కార్మికవర్గ విప్లవాలకు నాయకత్వం వహిస్తున్నది. "పెట్టుబడిదారీవర్గము తన గోరిని తవ్వే కార్మిక వర్గాన్ని తానే సృష్టించుకున్నది" అన్న మార్క్సుమాటలకు ఇదే అర్థము.

ఈ నూతనవర్గం ఒక నూతనసిద్ధాంతాన్ని చేపట్టి, ఒక విప్లవకరపార్టీని లేక సంస్థను నిర్మించి, పాతవిధానంమీద దండెత్తి దానిని మార్చివేస్తుంది. విప్లవవర్గం, దానికొక సరియైన విప్లవకర సిద్ధాంతం, దానినినడిపే సమర్థమైన నాయకత్వము - ఇవన్నీ కలిసినప్పుడే పాత సమాజగర్భంలోనుంచి నూతనసమాజం ఆవిర్భవించగలదు. ఈ పురుషప్రయత్నం (Subjective factor) లేనిదే, భౌతికపరిస్థితులు పరిపక్వమైనప్పటికీ విప్లవాలు విఫలంచెందిన ఉదాహరణలు అనేకం ఉన్నాయి. ఇదే విషయాన్ని మార్క్సు ఈక్రిందిమాటలలో వెలిబుచ్చాడు:

"పాతసమాజ గర్భంలోనుండి నూతన సమాజం ప్రసవమయ్యే సందర్భంలో ఒక మంత్రసాని అవసరం. "విప్లవమే (force) ఆ మంత్రసాని". పురుష ప్రయత్నంయొక్క ప్రాధాన్య

తను, విప్లవకరమైన, గుణాత్మక మార్పులయొక్క అనివార్య తను మార్క్స్ పై మాటలలో ప్రతిభావంతంగా వెల్లడించాడు.

6. చారిత్రక భౌతికవాదంలోని ప్రధాన సూత్రాలను ఇంతవరకు గమనించాము. శాస్త్రీయమైన ఈ నూతన దృష్టితో మానవసమాజ చరిత్రను పరిశీలించినపుడు, చరిత్ర నిర్జీవమైన తేదీల లిస్టుకాదని, రాజవంశ క్రమావళికాదని ఉత్పత్తిశక్తుల అభివృద్ధి చరిత్రయేనని, ఆ దృష్టితోనే ఏ దేశచరిత్రనైనా అధ్యయనం చేయవలెనని మనం గ్రహించగలం. ఇదే విష యాన్ని స్టాలిన్ ఈ క్రిందిమాటలలో వివరించాడు:

"కాబట్టి చరిత్ర నిజమగు శాస్త్రంగా ఉండాలంటే అది రాజుల, సేనానాయకుల కార్యకలాపముల వర్ణనగా కాక, 'విజేతల', 'ఆక్రమణదారుల' చర్యల రికార్డుగా కాక, భౌతికసంపదను ఉత్పత్తిచేసేవారి చరిత్రగా, శ్రామిక ప్రజల చరిత్రగా ఉండాలి."

"ఉత్పత్తిసూత్రాలను ఉత్పత్తిశక్తులయొక్క, ఉత్పత్తి సంబంధాలయొక్క అభివృద్ధిసూత్రాలను అవగాహన చేసుకొని బైటపెట్టడమే చరిత్రయొక్క ప్రధాన కర్తవ్యం."

(స్టాలిన్ - గతితార్కిక చారిత్రక భౌతికవాదం నుండి)

# 6. చరిత్ర పరిణామం-బూర్జువా సిద్ధాంతాలు

చారిత్రక భౌతికవాదం ప్రచారంలోకి రాకముందు నుంచీ, చరిత్ర పరిణామాన్ని వివరించటానికి, కొందరు బూర్జువా చరిత్రకారులు సిద్ధాంతాలు చేస్తూవచ్చారు.

ఒక దేశచరిత్ర ఆదేశంలోని జనాభా సాంద్రతనుబట్టి నిర్ణయించబడుతుందని మొదటి సిద్ధాంతం. భౌగోళిక పరిస్థితులు చరిత్రపరిణామాన్ని నిర్ణయిస్తవని రెండవ సిద్ధాంతం.

పై రెండు సిద్ధాంతాలకంటె విస్తార ప్రచారంగల మరి రెండు సిద్ధాంతాలుకూడా ఉన్నవి. మహాపురుషులు పుట్టినందువల్ల లేక నూతనభావాలు ప్రజలకు కలిగినందువల్ల చరిత్ర పరిణామం చెందుతుందనేసిద్ధాంతం మూడవది. మానవునిలో అంతర్గతంగా ఇమిడివున్న ఆధ్యాత్మికశక్తుల అభివృద్ధిక్రమమే మానవ సమాజ చరిత్ర అనీ అజ్ఞానంనుండి జ్ఞానంలోనికి, చీకటిలోనుండి వెలుతురులోనికి, అల్పత్వం నుండిఅఖండచైతన్యంలోనికి మానవుని జీవాత్మచేసే నిరంతర ప్రయాణమే చరిత్ర పరిణామానికి కారణమని నాల్గవ సిద్ధాంతం. ఈ ఆఖరు వాదనను యూరపులో 18 వ శతాబ్దంలో జన్మించిన హెగెల్ అను భావవాద తత్వవేత్త, నేడు మన దేశంలో భావవాద తత్వవేత్తలలో అగ్రేసరులైన అరవిందఘోష్, రాధాకృష్ణన్ మొదలైనవారు ప్రతిపాదిస్తూ ఉంటారు.

వీనిలో మొదటి రెండు సిద్ధాంతాలను ముందు పరిశీలిద్దాము. జనాభా సాంద్రత ఎక్కువగా ఉన్న దేశం నాగరికతా సాధంలో అగ్రస్థానంలో ఉంటుందని ఈ వాదన సారాంశం. ఈ వాదనే నిజమైనట్లయితే, అన్ని దేశాలకంటె అధికజనాభాగల చైనా, ఆ తర్వాత భారతదేశం, అభివృద్ధి క్రమంలో ప్రథమ, ద్వితీయ స్థానాలను నేడు ఆక్రమించుకోవాలి. కాని వాస్తవపరిస్థితి ఇందుకు విరుద్ధంగావుంది. జనాభాదృష్ట్యా మూడవ స్థానాన్ని ఆక్రమించుకునే సోవియటు రష్యా సోషలిస్టు

దశను అధిగమించి కమ్యూనిజంలోకి పురోగమిస్తున్నవి. నవ చైనా నూతన ప్రజాతంత్ర ఆర్థికవిధానంలో పురోగమిస్తున్నది. భారతదేశం ఇంకా భూస్వామ్య, పెట్టుబడీదారీ వ్యవస్థలోనే ఉన్నది.

వెనుకటిచరిత్రను గమనించినా ఇదే బోధపడుతుంది.

మొదట్లో ఏవో కొన్నిజాతులు వ్యవసాయాన్ని అలవర్చుకొని, బానిసవిధానంపై ఆధారపడి, నాగరికతా సౌధాన్ని నిర్మించుకున్నవి. ఈజిప్టు, బాబిలోన్, హారప్పా మొహంజదారో శిథిలాలద్వారా వ్యక్తమయ్యే భారతదేశంలోని ద్రావిడ నాగరికత - ఇవి చరిత్రలో మొట్టమొదట నాగరికతామార్గాన అడుగుపెట్టిన జాతులు. అధికసంఖ్యాకులైన ప్రజలు ఆనాటికి ఆదిమ కమ్యూనిస్టువ్యవస్థలోనే జీవిస్తూ వచ్చారు.

కాలక్రమేణ ఈ నాగరికతలన్నీ శిథిలమైనవి. తిరిగి కొంతకాలానికి ఇటలీ, గ్రీసు దేశాలలో బానిసవిధానంపై ఏర్పడ్డ నాగరికత ప్రభవించింది. క్రీ. శకము ప్రారంభంలో అదికూడా నశించింది.

కనుక జనసాంద్రత ఎక్కువగా ఉన్న జాతులు ఎక్కువ నాగరికతను సాధిస్తాయని, చరిత్ర పరిణామంలో ఉన్నత స్థానాన్ని అందుకుంటాయని చెప్పేవాదన సరిగాదు.

అదేవిధంగా భౌగోళిక, శీతోష్ణస్థితి పరిస్థితులు చరిత్ర పరిణామాన్ని నిర్ణయిస్తాయనే వాదన సరికాదు. గత 2 వేల సంవత్సరాలలోను ఇంగ్లాండు దేశంయొక్క శీతోష్ణస్థితిలో పెద్ద మార్పులేమీలేవు. కాని ఆ దేశం ఆదిమ కమ్యూనిస్టు విధానము,

బానిసవిధానము, భూస్వామ్యవిధానము - ఈ మూటినీ అధిగమించి పెట్టుబడిదారీ నాగరికతను అందుకున్నది. అదే శీతోష్ణస్థితిగల అట్లాంటిక్ మహాసముద్రంలోని కొన్ని దీవులలోని ప్రజలు ఇప్పటికీ అనాగరిక ఆటవిక స్థితిలో ఉన్నారు.

కనుక ఈ వాదననుకూడ త్రోసిపుచ్చవలసి ఉంటుంది.

మహాత్ములు, మతప్రవక్తలు, వారి సిద్ధాంతాలు, లేక వీరులు చరిత్రగతిని నిర్ణయిస్తారనే వాదనను పరిశీలిద్దాము.

ఏసుక్రీస్తు, బుద్ధుడు, మహమ్మద్ వంటి ప్రవక్తలు, గాంధి వంటి రాజకీయ నాయకులు, అలెగ్జాండర్, నెపోలియన్ వంటి వీరులు - ఆయా కాలాలలో చరిత్ర గమనంపై కొంత ప్రభావాన్ని కలిగించినమాట వాస్తవమే. కాని వీరి చర్యలే చరిత్రపరిణామానికి కీలకమని, మూలకారణమని చెప్పటం పూర్తిగా పొరపాటు.

ఏసుక్రీస్తు బానిసవిధానంలో ప్రజలుపడే కష్టాలను గుర్తించి, "అందరూ దేవునిబిడ్డలు కనుక అందరూ సమానులే" అనే నినాదంతో బానిసవిధాన కాఠిన్యాన్ని ఎదిరించినమాట నిజం. అందువల్లనే క్రైస్తవమతం విస్తార ప్రచారాన్నికూడా పొందింది. రోము సామ్రాజ్య పతనకాలంలో క్రైస్తవ మిషనరీలు విప్లవకారులుగా కూడా గుర్తించబడ్డారు. అనేక కష్టాలు భరించారు. తన ఆశయసాధనకై ఏసుక్రీస్తు శిలువపైన మరణించాడు.

ఐతే క్రీస్తు మరణానంతరం 200 సంవత్సరాలకల్లా ఆమతంలోని సమానత్వసిద్ధాంతాలు వెనుకకు నెట్టివేయబడ్డవి. భూస్వామ్య విధానంలోని రాజులదోపిడీని సమర్థించే మతంగా క్రైస్తవమతం తయారైంది.

కనుక ప్రబలమైన ఆర్థిక రాజకీయ కారణాలకు లోబడి మాత్రమే క్రైస్తవమతం పనిచేసిందని మనం గుర్తించ గలము.

బుద్ధుని ఉదహారణచూద్దాం. క్రీ. పూ. 550 సంవత్సర కాలంలో బుద్ధుడు భారతదేశంలో జన్మించి కులభేదాలను ఖండిస్తూ, సమానత్వ సిద్ధాంతాలను ప్రచారం చేశాడు. బుద్ధుని ఈ బోధలు, బానిసవిధానంనుండి, అర్ధబానిస విధానానికి మారు తున్న భారతీయ సమాజ పరిణామానికి ఒక నైతిక బలాన్ని, సిద్ధాంత పటుత్వాన్ని సమకూర్చాయి. ఆ కారణంవల్ల, బౌద్ధ మతం ప్రజలలో వేరూనింది, ప్రజామతంగా రూపొందింది. బ్రాహ్మణుల, రాజులయొక్క, రాజకీయ, ఆర్థిక, సాంఘిక నిరంకుశత్వంపట్ల ప్రజలకుగల తీవ్ర అసంతృప్తి బౌద్ధమత రూపంలో వెల్లి విరిసింది.

కాని 2, 3 శతాబ్దాలు గడిచిన మీదట, అశోక చక్రవర్తికాలంలో బౌద్ధమతం ప్రభుత్వమతం కావటంతో దాని పతనం ప్రారంభమైంది. బుద్ధుని సిద్ధాంతాలకు పూర్తిగా విరుద్ధ మైన సిద్ధాంతాలు, మహాయాన, వజ్రయాన శాఖలు ఆ మతంలో తలఎత్తినవి. బౌద్ధధర్మము దాని అభ్యుదయకర పాత్రను కోల్పోయింది.

గాంధీగారి సిద్ధాంతాల విషయంలో కూడా ఇదే జరిగింది. 1920-50 సంవత్సరాల మధ్య గాంధీగారి సిద్ధాం తాలు, ఒకవైపున బ్రిటిషు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరా టాన్ని కొద్దిగా తీవ్రతరంచేయటం, మరొకవైపున ఈ పోరాటం భారత బూర్జువావర్గ పెత్తనానికి ప్రమాదకరం కాకుండా అదుపులో పెట్టటం అనే రెండులక్ష్యాల సాధన కుపకరించాయి.

ఇందులో మొదటి లక్ష్యసాధన కుపయోగించినంతవరకు అవి సమాజపరిణామానికి దోహదకరమై, అభ్యుదయకరపాత్రను కలిగి ఉన్నాయి. క్రమంగా ఆ లక్ష్యం వెనుకడుగువేసి, రెండవలక్ష్యంమాత్రమే బూర్జువావర్గ ప్రయోజనాల రక్షణ ప్రధానం కావటంతో; ఆ సిద్ధాంతాలు అభివృద్ధినిరోధకంగా తయారైనవి.

కనుక మహాత్ములు, ప్రవక్తలు వారి సిద్ధాంతాలు సమాజపరిణామంపై గలిగించే ప్రభావము, పరిణామ సూత్రాల కనుగుణ్యంగా ఉన్నంతవరకు మాత్రమే అభ్యుదయకరపాత్రను కలిగిఉండి, ఆపైన అభివృద్ధినిరోధకంగా తయారవుతాయి.

ఇక వీరులవిషయం చూద్దాం. 16వ శతాబ్దం ఆఖరులో మొగలు పాదుషా ఐన ఔరంగజీబు సామ్రాజ్య తత్వానికి వ్యతిరేకంగా, శివాజీ మహారాష్ట్ర ప్రజలకు నాయకత్వం వహించాడు. మహారాష్ట్రంలోని పేదరైతాంగానికి నాయకుడై, వీరత్వాన్ని ప్రదర్శించి, ఔరంగజీబు సామ్రాజ్యాన్ని గడగడలాడించి, మహారాష్ట్ర స్వాతంత్ర్యవీరుడుగా గుర్తించబడ్డాడు. అంతవరకూ ఆయన చర్యలు ప్రజావాంఛకు అనుగుణ్యంగా ఉన్నాయి. కనుక శివాజీని స్వాతంత్ర్యవీరులలో అగ్రగణ్యునిగా మనం గుర్తిస్తున్నాము.

కాని తానొక ప్రభుత్వాన్ని స్థాపించవలసిన సమయం వచ్చేసరికి, శివాజీసైతం, ఛత్రపతిగా మారిపోయినాడు. తానూ ఒక చక్రవర్తి ఐనాడు. భూస్వామ్యవిధాన పరిమితులకు లోబడి మొగలు సామ్రాజ్యానికి పోటీగా, మహారాష్ట్ర సామ్రాజ్యానికి అంకురార్పణ చేసినవాడైనాడు. తత్ఫలితంగా ప్రారంభంలో

శివాజీ నాయకత్వాన్ని అంగీకరించిన మహారాష్ట్ర క్షేత్రాంగం, పేదప్రజలు క్రమంగా ఆ ప్రభుత్వానికి దూరంకాసాగారు. శివాజీ జీవితంలోని ఆఖరు రోజులకే ఈమార్పు కొద్దిగా ప్రారంభమైంది. శివాజీ అనంతరం పరిపాలించిన శంభాజీ, ఆ తర్వాత వచ్చిన పీష్వాలకాలంలో, మహారాష్ట్ర సామ్రాజ్యంకూడా ఇతర సామ్రాజ్యాలవలెనే ఒక నిరంకుశ ప్రభుత్వంగా మారిపోయింది.

చరిత్ర పరిణామంలో మహాపురుషుల పాత్రను వివరిస్తూ స్టాలిన్ ఇలా అన్నాడు:

"చరిత్రలో కొందరు మహాపురుషు లున్నమాట నిజమే. అయితే చరిత్ర పరిణామాన్ని గుర్తించి అందు కనుగుణ్యంగా ప్రవర్తించినంతవరకే ఆ మహాపురుషుల గొప్పతనం."

ఇక ఆఖరు సిద్ధాంతం విషయం పరిశీలిద్దాం.

ప్రతి వ్యక్తిలోను అంతర్గర్భితంగా, రెండుశక్తులున్నాయని, మానవత్వము, పశుత్వము అను ఈ రెండుశక్తులమధ్య జరుగుతున్న ఘర్షణ ఫలితంగానే సమాజం పురోగమిస్తున్నదని వీరివాదన. ఇదిపూర్తిగా భావవాదసిద్ధాంతమని వేరే చెప్పనక్కరలేదు. మనదేశంలో రాధాకృష్ణపండితుడు ఈ సిద్ధాంతానికి నాయకుడు. ఈ భావవాదసిద్ధాంతాన్ని మరికొంత ముందుకు తీసుకువెళ్ళి స్వర్గీయ అరవిందఘోష్ ఇలా వాదిస్తున్నాడు: "మానవునిలో అనాదినుంచి బీజప్రాయంగా దైవాంశ ఉన్నది. దీనిని మనం మానవత్వం అంటాము. ఈ దైవాంశ పెరిగి, పెద్దదై, పశుత్వాన్ని పూర్తిగా జయించినమీదట, మానవుడు,ఉన్నతమానవుడు (Super-man) ఔతాడు; అనగా

దేవునికి అత్యంత సన్నిహితుడౌతాడు". ఇదీ అరవిందఘోష్ సిద్ధాంతం.

పై సిద్ధాంతాన్ని విమర్శించేముందు ఒక విషయం చెప్పాలి. అరవిందఘోష్ సిద్ధాంతం మనకు కొత్తదికావచ్చు; కాని ప్రపంచానికి కొత్తదికాదు. మార్క్సుకు పూర్వీకుడైన హెగెల్ సిద్ధాంతం ఇలాంటిదే. హెగెల్ వాడిన అఖండ భావము (World spirit) నకు, అరవిందుని ఉన్నతమానవు (Super man) నికి దగ్గర సంబంధముంది.

హెగెల్ సిద్ధాంతంలోవలెనే, అరవిందుని సిద్ధాంతంలోను, రాధాకృష్ణుని సిద్ధాంతంలోను, గతితార్కిక దృక్పథం ఉన్నది. అనగా, ఆంతరంగిక వైరుధ్యాల ఫలితంగానే పురోగమనం ఉంటుందని వీరు గుర్తిస్తున్నారు. అయితే ఈ వైరుధ్యాలను వీరు వాస్తవమైన, ప్రాథమికమైన మానవుని భౌతికజీవితంలో చూడటంలేదు. కేవలం భావప్రపంచంలో మాత్రమే చూస్తున్నారు. ఇది వీరి దృక్పథంలోని ప్రధాన లోపం.

హెగెల్ చేతులలో గతితార్కిక దృక్పథం తల్లక్రిందులుగా, శీర్షాసనంవేస్తున్నట్లుగా ఉంది. ఆ దృక్పథాన్ని మార్క్సు స్వీకరించి దాని లోపాలను సరిచేసి, కాళ్ళమీద నిలవబెట్టి, భౌతికజీవిత పరిస్థితులకు వర్తింపచేశాడు.

హెగెల్ దృక్పథాన్ని ఖండిస్తూ మార్క్సు ఇలా అన్నాడు:

"హెగెల్ ఆలోచనా క్రమాన్ని భావం (Idea) అనే పేరుతో ఒక ప్రత్యేక వస్తువుగా మార్చివేశాడు. దీనినే నిజమైన

ప్రపంచానికి సృష్టికర్త అనీ, భావంయొక్క బాహ్యదృగ్గోచర స్వరూపమే ప్రపంచమనీ హెగెల్ వాదన. కాని నాదృష్టిలో అదికాదు. మానవ మేధస్సుచే ప్రతిబింబింపబడి ఆలోచనా రూపాలలోకి మారినట్టి భౌతికప్రపంచమే భావనకాని మరొకటి కాదు." (మార్క్స్ - కాపిటల్ 1 వ వాల్యూంనుండి)

ఇదే విమర్శ రాధాకృష్ణ, అరవింద సిద్ధాంతాలకుకూడా వర్తిస్తుంది. మానవునిలోని మానవత్వం, పశుత్వం అను లక్షణాలు ఆ మానవుడు జీవిస్తున్న సమాజ నాగరికతా స్థాయిని బట్టి ఉంటాయి. సమాజ నాగరికత, సమాజంలోని ఆర్థిక, రాజకీయ, సాంఘిక విధానాల ఫలితంగా నిర్ణయించబడుతుంది.

పైన వివరించిన వివిధసిద్ధాంతాలు చరిత్ర పరిణామానికి గల మూలకారణాలను వివరించకపోగా, ఆకారణాలను కప్పిపుచ్చుతున్నవని, చారిత్రక భౌతికవాదమే సరియైన సిద్ధాంతమనీ మనం గ్రహించగలము.

# 7. సమాజ చరిత్రలో వివిధ దశలు

ఉత్పత్తిశక్తుల మార్పు, అభివృద్ధి ననుసరించి యింతవరకు చరిత్రలోవచ్చిన ప్రధానమగు ఉత్పత్తి దశలను యీ సందర్భంలో గమనించవలసి యున్నది. ఈ దశలు అన్ని దేశాల్లోనూ ఏకకాలంలో ఒకేరూపంలో యేర్పడలేదు. వివిధ దేశాల్లో, వివిధకాలాల్లో కొద్ది రూపబేధాల్లోనే యివి యేర్పడుటను చూడగలము. ఇందుకు కారణం ఆయాదేశాల ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలో వుండే కాలవ్యత్యాసమూ, రూపభేదములే. ఉదా

హరణకు అబిసీనియా దేశమందలి వ్యవస్థకు, ఇండియా యందలి వ్యవస్థకు, ఇంగ్లండునందుండే వ్యవస్థకు, సోవియట్ యూనియన్‌లోని వ్యవస్థకు ప్రధాన భేదాలు కన్పించగలవు. అబిసీనియా యిప్పుడు బానిసత్వము, ఫ్యూడలిజముల కలగా పులగమైన సమాజవ్యవస్థను కల్గివుంది. ఇండియాలో ఫ్యూడలిజం, పెట్టుబడిదారీవిధానములున్నాయి. ఇంగ్లండులోపూర్తిగా పెట్టుబడిదారీ విధానమున్నది. సోవియట్ యూనియన్‌లోని సమాజం సోషలిజాన్నికూడా దాటిపోయి కమ్యూనిజములో అడుగుపెడుతోంది. ఇదేవిధంగా అన్ని దేశముల్లోనూ ఈసామాజికవ్యవస్థలు ఒకేరూపాన్నికల్గిఉండలేదు. యూరప్‌లో ఫ్యూడలిజం, వెట్టిచాకిరీ యేర్పడితే ఇండియా, చైనా మున్నగు ఆశియాఖండ దేశాలలో పురాతన కమ్యూనిజం, బానిసత్వం, జమీందారీపద్ధతి అన్నింటినీ మేళవించుకొన్న 'గ్రామీణ వ్యవస్థ (ఆసియాఖండపు సమాజవ్యవస్థ అని మార్క్సు అన్నాడు)' యేర్పడింది. అమెరికాలో అసలు ఫ్యూడలిజమే యేర్పడక సరాసరి పెట్టుబడిదారీ విధానం యేర్పడింది. కాబట్టి ప్రపంచం మొత్తంమీద చూస్తే యింతవరకూ యేర్పడిన ప్రధాన ఉత్పత్తి సంబంధాలను ఈ క్రిందివాటిగా చెప్పవచ్చును: 1. ఆదిమ కమ్యూనిజం 2. బానిసవిధానం 3. భూస్వామ్య విధానం, ఆశియాలో గ్రామీణవ్యవస్థ 4. పెట్టుబడిదారీ విధానం 5. సోషలిజం.

ఆదిమ కమ్యూనిస్టుసమాజం, బానిస విధానముల పూర్తి స్వరూపాన్ని తెలుసుకోవాలంటే ఎంగెల్స్ వ్రాసిన "కుటుంబం, స్వంత ఆస్తి, రాజ్యాంగ యంత్రముల పుట్టుపూర్వో

త్తరాలు" అనే గ్రంథం ప్రామాణికమైనది. భారతదేశంలో సామాజిక పరిణామాన్ని గూర్చి తెలుసుకోవాలంటే వేదాలు, పురాణాలు, రామాయణాలు, భారతాది కావ్యాలు, భాసుడు, శూద్రకుడు వగైరా పూర్వకవుల నాటకాలు మున్నగువాటిని పరిశీలించాలి. శ్రీ డాంగే వ్రాసిన "భారతదేశం, ఆదిమ కమ్యూనిజంనుండి బానిస విధానంవరకు" అన్న గ్రంథంలో భారత సమాజ చరిత్రను శాస్త్రీయదృష్ట్యా అధ్యయనం చేయటానికి ప్రథమ ప్రయత్నం జరిగింది.

## ఆదిమ కమ్యూనిస్టు సమాజం

చరిత్రలో మనకు తెలిసినంతవరకు మానవుని పనిముట్లు రాళ్ళతోనూ, కర్రతోనూ చేయబడేవి. ఒకే ఆయుధాలుగా కూడా వుండేవి. ఆ కాలంలో మానవుడు మృగములనుండి పెద్దగా భేదించినదేమీ లేదు. కాళ్ళపై నడవటం, కొద్దిగా ఆలోచించటం తప్ప మృగములను వేటాడి జీవించడమే అతని జీవనోపాధి. ఇందువల్లనే అతని పనిముట్లూ, ఆయుధాలూ ఒకటే. ఈ కాలంలో అడవిమృగములు గుంపులు గుంపులుగా నివశించినట్లే మానవులు కూడా చిన్నచిన్న గుంపులుగా నివసిస్తూ వుండేవారు. కొండగుహలే వారికి యిళ్ళు; తర్వాత ఆకు అలములతో నిర్మింపబడిన గుడిశెలు. ఇటువంటి ఉత్పత్తి పరిస్థితుల్లో గుంపంతా సమష్టిగానే పనిచేయవలసి వచ్చేది. మహారణ్యములలో కర్రలతోనో, రాళ్ళతోనో భయంకర మృగముల నుండి రక్షించుకొనడంగాని, వేటాడడంగాని, ఒకరిద్దరికి సాధ్యమయ్యేపని కాదు; కాబట్టే గుంపు యావత్తూ సమష్టిగానే వేటాడేది. ఇటువంటి పరిస్థితుల్లో ఆ పనిముట్లు

ఎవరివనే ప్రశ్న లేనేలేదు. పనిముట్లు గుంపు మొత్తమునకు చెందివుండేవి. అనగా సమాజపరమై వుండేవి. ఈవిధంగా వుత్పత్తిశక్తులకు అనుగుణ్యంగా వుత్పత్తివిధానంకూడ వుండేది. ఉత్పత్తి గావించే పరికరాలూ, సాధనాలూ. ఉత్పత్తికాబడ్డ దినుసులూకూడ మొత్తం సమాజపరమై వుండేవి. ఈ గుంపులే తర్వాత గణములుగానూ, తర్వాత వివిధ ఆదిమ తెగలుగానూ అభివృద్ధి చెందాయి.

మానవుని పనిముట్లు అభివృద్ధి కావటంతో అతని జీవితవిధానంలో పెద్దమార్పు వచ్చింది. విల్లంబులు కనిపెట్ట బడిన కొంతకాలానికి పశువులను మచ్చికచేసి పెంచటం వచ్చింది. పశువులను పెంచటంద్వారా ప్రతియేటా పిల్లలను యీనటమేగాక ప్రతిదినం పాలు, పెరుగు, మాంసం వగైరాలు లభించగలవు. తోళ్లు, కొమ్ములు వగైరాలుకూడా లభించగలవు. పశుపాలనతో బ్రహ్మాండమగు మార్పు వచ్చింది. క్రూరమృగ భయంలేనట్టి పచ్చికమైదానాలలో ప్రజలు నివశించడం ప్రారంభించారు. ఒకప్రాంతంలోపచ్చికఅయిపోతే, లేక పెరిగిన పశుగణములకు మేతలేకపోతే కొత్త ప్రదేశాలకు వలసపోయేవారు. ఈవిధంగా వేటనే ప్రధానవృత్తిగా స్వీకరించిన తెగలుకొన్ని, పశుపోషణను ప్రధాన వృత్తిగా స్వీకరించిన తెగలు కొన్ని ఏర్పడ్డాయి. ప్రప్రథమ సామాజిక శ్రమవిభజన ఏర్పడ్డది.

పశుపాలనతో బాటుగా, అందుకు సంబంధించే కొన్ని వుత్పత్తిరూపాలుకూడ వెలసినవి. పశువుల మేతతోబాటు మానవులకు తిండిగింజలుకూడ దొరికేవి. పశువుల తోళ్లతో గుడారములు, దుస్తులు చేయటం వచ్చింది. కొంతకాలం

పిమ్మట మగ్గము, ముడిలోహములను కరిగించి లోహములను వుత్పత్తి చేయటంవచ్చాయి. ఆహారపదార్థాల కొరత విస్తారంగా ఉండటంవల్ల ఓడిపోయిన గణసభ్యులను పూర్తిగ చంపివేసే వారు. కొన్ని సందర్భాలలో నరమాంసభక్షణకూడా ఉండేది.

భారతదేశంలో ప్రథమంగా రాగి, తగరం, కంచు లోహములతో వస్తువులు చేయబడేవి. ఇనుము తర్వాత చాలా కాలానికి వచ్చింది.

సమాజం యీదశకు వచ్చుసరికి కొద్దిగా మారకం ప్రారంభమైంది. వేటగాండ్ర తెగలకు, పశుపాలకుల తెగలకు వస్తుమారకం జరిగేది. పశుపాలక తెగలు మైదానాలలో నివ శించుచుండుటచే డేరాలు, యిండ్లు నిర్మాణం ప్రారంభమై కలకాలం పచ్చిక దొరికే నదీప్రాంతాల్లో స్థిరనివాస మేర్పాటు చేసుకొని గ్రామాలను, పట్టణాలను నిర్మింపసాగేరు; ఆర్యులు గంగా- సింధు ప్రాంతంలో (ఆర్యావర్తంలో యీదశలోనే) స్థిరనివాస మేర్పరచుకొని గ్రామాలను పట్టణాలను నిర్మించ సాగేరు.

ఈకాలంలో ప్రభుత్వం, అధికారులనేవారు ఎవరూ లేరు. వేటాడుటకు నిశ్చయించాలన్నా, ఇతర గుంపులపై, గణములపై పగతీర్చుకొనుటకో, వారిని సంహరించి, వారి ప్రాంతాన్ని ఆక్ర మించుకొని, అందులో వేటాడుకొనుటకో యుద్ధాన్ని చేయ నిశ్చయించాలన్నా గుంపుమొత్తం స్త్రీ, పురుషులు యావత్తూ సమావేశమై నిశ్చయించటం వుండేది. గణమునకు పెద్దమాత్రం స్త్రీ కావచ్చు, పురుషుడు కావచ్చు - వుండేవారు. యుద్ధ సమయాల్లో తాత్కాలికంగా యుద్ధనాయకుని యెన్నుకోవటం

జరిగేవి. ఆస్తి సమాజపరమై వుండటంవల్లనూ, వుత్పత్తిని సమాజమంతా సమిష్టిగా వినియోగించటంవల్లనూ ఆస్తిపరులు, ఆస్తివిహీనులనే విరుద్ధవర్గాలు లేవు. అందువల్ల ఒకరినొకరు అణిచి పెట్టివుండే నిర్బంధయంత్రం అవసరంలేకపోయింది.

ఈ దశలో స్త్రీ పురుషులు సమానులు. స్త్రీ గృహ యజమానురాలు. పురుషుడు గృహంబయట యజమాని. బిడ్డల పెంపకం స్త్రీ చూస్తూండేది. పురుషునితోబాటు స్త్రీ కూడా గణవ్యవహారా లన్నింటిలోనూ, యుద్ధంలోకూడ పాల్గొనేది.

సమాజంయొక్క యీ దశకు అనుగుణ్యంగానే వివాహ పద్ధతికూడా వుండేది. మొట్టమొదట ఒక గుంపులోని స్త్రీ, పురుషు లందరూ వుమ్మడి భార్యాభర్తలు. కొంతకాలమైన పిమ్మట ఏక మూలపురుషుని గణములూ, తెగలుగా వృద్ధి చెందిన పిమ్మట ఒక గణంలోని పురుషులు వేరొక గణంలోని స్త్రీ లందరకూ భర్తలుగా వుంటూవుండడం యేర్పడింది. గోత్రములు, ప్రవరలు అనేవి ఆ కాలమందలి తెగలకు, గణములకు సంబంధించినవే. అందువల్లనే గోత్రీకులకూ, సపిండులకూ మధ్య వివాహాలు నిషేధింపబడ్డాయి. ఇప్పటివారి కింత వెగటుగానూ, దుష్టంగానూ తోచినా సమాజంలో ఒకప్పుడు బహుభార్యాత్వము, బహుభర్తృత్వమూ వుండేవని చెప్పుటకు అనేక వుదాహరణ లున్నాయి.

ఆంధ్రదేశంలో కూడ యిట్టిదశ వున్నదని కొన్ని వుదాహరణలవల్ల తెలుసుకోవచ్చును. తండ్రి సోదరులను 'పినతండ్రి'

'పెదతండ్రి' అనటమే వున్నదిగాని, మరొకపదం లేదు. 'ఇల్లాలు' అనే పదంవల్ల యింటి వున్మసిభార్య అని తెలుస్తున్నది. కుల దేవతలు సామాన్యంగా స్త్రీలు. గొడసాని, భోగము స్త్రీ నిత్య పుణ్యాంగనలు.

వివాహం యిటువంటి పద్ధతిలో జరిగేదికాబట్టి, తండ్రి యెవరో తెలియదు. స్త్రీదే గృహంలో యాజమాన్యం కనుక స్త్రీనుండే వారసత్వం సంక్రమించేది. ఇప్పటికీ మలబారులో 'మరుమక్కతాయం' అనేపద్ధతి ప్రకారం వొకని ఆస్తి తోబుట్టువులకే సంక్రమించటం వున్నది. ఈ సమాజాన్ని మాతృస్వామిక సమాజం అని పిలుస్తున్నాము.

## బానిసవిధానం

వ్యవసాయం నేర్చుకోవటంతో సమాజంలో పనివిభజన మరెంత ఉచ్ఛస్థాయికి వెళ్ళింది. వ్యవసాయం చేతనైన గణాలు తామింత తిని ఒరులకింతపెట్టగల సామర్థ్యాన్నికూడా సంపాదించుకున్నాయి. ఓడిపోయినవారిని బానిసలుగాచేసుకోసాగారు. బానిసలు, బానిస యజమానులనే వర్గవిభజన ప్రారంభమైంది. ఆదిమ కమ్యూనిస్టు సమాజం ధ్వంసమై వర్గసమాజం ఆవిర్భవించింది. లోహాలతో పనిముట్లు, ఆయుధాలు తయారు చేయడంతో వుత్పత్తిలో బ్రహ్మాండమగు మరొకమార్పు వచ్చింది. అరణ్యములను ఛేదించి వ్యవసాయం చేయడం రామాయణ కాలంనాటికి కొంత అభివృద్ధిఅయినది. ఏదో ఒక గణములో చేతిపనులుకూడా అభివృద్ధిచెంది వ్యవసాయంనుండి వేరుగా యేర్పర్చబడినమీదట ఒకగణానికి, మరొక గణానికి మధ్య

మారకంకూడా అభివృద్ధి చెందింది. ఇందుమూలకంగా మానవ శ్రమయొక్క ఉత్పత్తి శక్తి పెరిగింది.

ఈవిధంగా వేట, పశుపాలన, వ్యవసాయాలనుండి చేతిపనులు విడిగావటంతో యజమానులు - బానిసలు అనే రెండువర్గాలు, దోచుకునేవారు - దోచుకోబడేవారు అనే రెండుచీలికలు సమాజంలో యేర్పడినవి.

ఈనాటి తెగలస్వరూపంలోకూడ మార్పులువచ్చాయి. రక్తసంబంధీకమగు తెగలుకలిసి పెద్దకులములు (కమ్యూనిటీలు)గా యేర్పడ్డాయి. మూలముగావున్న గణములు మరీ పెరిగిపోవుటచే గణములు చీలిపోయి పెద్దపెద్ద కుటుంబము లేర్పడ్డాయి. ఒకే కుదురుగలవారంతా కలిసి ఒకపెద్ద సమిష్టి కుటుంబంగా నివసించటం ప్రారంభమైంది. పశువులు, భూమి కూడా హక్కునుబట్టి గణము మొత్తానికే చెందినా అనుభవ మునుబట్టి కుటుంబ ఆస్తిగా తయారైనవి. సమిష్టి ఆస్తి స్వత్వములు దుర్బలమై, క్రియలో వ్యక్తిగత కుటుంబ ఆస్తి యేర్పడింది.

పశుపాలన, వ్యవసాయం, కుటుంబ ఆస్తితోబాటు పురుషుని ఆధిక్యత వెలసింది. పూర్వంవలెనే స్త్రీ గృహకృత్యములను నిర్వహిస్తున్నది. కాని ఉత్పత్తిరంగంలో నేడు గృహకృత్యములు అతి స్వల్పభాగాన్నిమాత్రమే కల్గివున్నవి. పశువులు, భూమి, పనిముట్లు వగైరాలే నేటి సంపదలు. ఇది పురుషుని స్వాధీనం కాబట్టి పురుషుడు ముఖ్యుడయ్యాడు. సామాజికోత్పత్తిలో స్త్రీకి స్థానంలేదు. కాబట్టి ఆమె స్థానం హీనమైపోయింది. స్త్రీ స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది.

దీనితో బాటే వివాహంలో కూడ మార్పులు వచ్చాయి. బహుభర్తృత్వం, బహు భార్యాత్వము బదులు ఒక కాలంలో ఒక పురుషుడు, ఒక స్త్రీ మాత్రమే భార్యాభర్తలుగా వ్యవహరించే దాంపత్యము వచ్చింది. ఇందువల్ల యెవరిసంతతి యెవరో తెలియుటకు వీలేర్పడింది. పురుషుడు తన ఆస్తిని తన బిడ్డలకే సంక్రమింపచేయుటకు వీలేర్పడింది. అతడు కుటుంబంలో పెత్తందారు కావటంతో అతని సర్వాధిపత్యానికి ఆటంకంగా వుండే మాతృస్వామికహక్కు కూలద్రోయబడింది. పితృస్వామిక హక్కు - తండ్రినుండే వారసత్వం రావటం - స్థాపించబడింది. "మాతృస్వామిక హక్కు కూలద్రోయబడటం ప్రపంచంలో స్త్రీలుపొందిన చరిత్రాత్మకమగు వోటమి" అని ఎంగెల్స్ తెలియచేశాడు. ఇతటితో స్త్రీకి కుటుంబములోనూ, సమాజంలోనూ వుండే గౌరవం, అధికారం, హక్కులు అంతమై చాకిరీ చేసేటటువంటి, పిల్లలను కనేటటువంటి యంత్రంగా చేయబడింది.

వేదకాలంనాటికి స్త్రీ పురుషులు, సమానంగా చూడబడేవారనుటకు కొన్నిఆధారాలున్నాయి. అనార్యులలో స్త్రీలు దుర్గ రక్షకులుగానూ, మండలాధిపత్నులుగానూ నియమింపబటడం లంకిణి, తాటకి మొదలైన వుదాహరణలవల్ల తెలియగలదు (ఈ వ్యక్తులు చారిత్రాత్మక వ్యక్తులు కాకపోయినా ఆ కాలమందలి సమాజ పరిస్థితులు ఈ పాత్రలద్వారా చిత్రింపబడుచున్నవని తెలుసుకొనగలము). ఆర్యుల్లో గార్గి, మైత్రేయి మున్నగువారు మహాపండితులై శాస్త్రచర్చలు గావించేవారని తెలుస్తోంది. కాని వ్యవసాయం కొంత అభి

వృద్ధియై ఆ స్త్రీహక్కు లేర్పడి, పురుషుడు సర్వాధిపతియైన రామాయణ కాలంనాటికి స్త్రీ కేవలం పురుషునకు బానిసయౌతుంది. పతివ్రతాధర్మము పరమధర్మముగా శాసించబడుతుంది. స్త్రీ సహధర్మచారిణి మాత్రమే ఔతుంది.

సమాజం యీదశకు చేరినపిమ్మట అందలి ఉత్పత్తి శక్తులు త్వరితంగా వృద్ధిచెందినవి. వృత్తులు పెరిగినవి. నేత, వడ్రంగం, కమ్మరం, కుమ్మరం, లోహకారకం వగైరా వృత్తులే గాక వస్తుశిల్పం, చిత్రలేఖనం, నౌకానిర్మాణం వగైరాలు కూడా పెరిగినవి. వర్తక వాణిజ్యాలు, తెగలు, వివిధప్రాంతాల మధ్యనే గాక వివిధ దేశాలతోకూడ జరిగేవి. సంపదలు ప్రోగు పడజొచ్చినవి. వడ్డీవ్యాపారం బైలుదేరింది. పరిశ్రమలు వ్యవసాయం వేరైనవి.

సమాజంలో యిప్పటికి వర్గములు యేర్పడటం పూర్తిగా పరిపక్వమైనది. బానిస - యజమాని, పేద - ధనికుడు అనే భేదాలు యేర్పడ్డాయి. స్వంత పనిముట్లతో స్వీయకుటుంబ పోషణార్థం వుత్పత్తి నిగావించే స్వతంత్ర వుత్పత్తిదారుని స్థానే యితరులకొరకై, యజమానులకొరకై శ్రమచేసే బానిసలు వచ్చారు. ఆస్తి సమాజమంతటియొక్క ఉమ్మడిఆస్తిగా వుండుటకుబదులు బానిసయజమానుల స్వంతఆస్తి అయింది. చరిత్రలో యిక దారుణమగు వర్గపోరాటం ప్రారంభమైనది.

## రాజ్యాంగయంత్రం జననం

లోగడ ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో వర్గవిభేదాలనేవి యెరుగనట్టి గణములుండేవి. అందుకు తగినట్టి నిర్మాణ పద్ధతులనే యీగణములు కల్గివుండేవి. కాని, యిప్పుడు యజ

మానులు - బానిసలు, దోపిడిగావించే ధనికులు - దోచుకోబడే పేదలు అనే విరుద్ధవర్గాలుగల సమాజపద్ధతి వచ్చింది. ఈ సమాజ పద్ధతిలో వైరుధ్యాలు పరిష్కారం కావుసరికదా, పెరుగుతూనే వుంటాయి. సదా బహిరంగంగానో, పరోక్షంగానో పోరాటం, సంఘర్షణ జరుగుతూ వుంటుంది. కాబట్టి తమ ప్రయోజనాలను కాపాడుకొనుటకై తమ దోపిడీని కొనసాగించుటకై సమాజంలో 'శాంతి', 'భద్రత'లను కాపాడుటకై యజమానుల వర్గానికి ఒక ఆయుధం కావల్సివచ్చింది. రాజ్యాంగ యంత్ర రూపంలో యీ ఆయుధం అవతరించింది.

భారతదేశంలో కాని, మరే యితర ప్రధాన దేశంలో గాని, 'నావిష్ణుః పృథివీపతిః' అనే సూత్రం పరమ సత్యముగా చలామణీ అయింది. "దుష్ట శిక్షణకూ, శిష్ట రక్షణకూ, ధర్మ పరిపాలన గావించుటకు దేవుడే రాజురూపంలో అవతరిస్తా"డన్నారు. ఆర్యులు సింధునదీ ప్రాంతానికి వచ్చుసరికి వారికి కులపతులు, యుద్ధనాయకులు మాత్రము వుండేవారు. వేదాలు మొదలైన వాటిలో కన్పించే పురుకుత్సుడు, పురూరవుడు మున్నగువారు యిటువంటివారే. కాని ఆర్యులు సింధునదీ ప్రాంతానికి వచ్చుసరికే అచ్చట అదివరకేచేరి స్థిరనివాసమేర్పరచుకున్న ద్రావిడులు రాజ్యాల నేర్పరచుకొని, రాజ్యాంగ యంత్రమును నిర్మించినట్లు మొహంజొదారో హరప్పా శిథిలాలనుండి తెలుసుకగలము. ఆర్యులు ఆర్యావర్తంలో స్థిరపడిన పిమ్మట వారుకూడా వ్యవసాయాన్ని సాగిస్తూ ఓడిపోయిన ద్రావిడులను బానిసలుగా చేసుకొన్న పిదప రాజులు పుట్టటం, రాజ్యాలు పుట్టటం జరిగింది. ఇదిఅంతా జరుగుటకు వందల సంవత్సరాలుపైగా పట్టి

వుంటుంది. రామాయణకాలంనాటికి ఆర్యుల రాజ్యాలుకూడా స్థిరపడటం, (కోసలరాజ్యం, విదేహ రాజ్యం వగైరాలు) పురోహిత ప్రాబల్యంక్రింద రాచరికం దృఢంగా ప్రతిష్ఠింపబడటం జరిగింది. రాజధర్మాలు నిర్వచించబడతాయి. రాముడనే పాత్రద్వారా ఆదర్శప్రాయుడగు రాజు, అధర్మప్రాయమగు రాచరిక పరిపాలన సూచించబడతాయి. (క్రీ. పూ. 2500 ప్రాంతం).

రామరాజ్యంలో రాజ్యాంగయంత్ర స్వరూపాన్ని స్థూలంగా, దాని శైశవావస్థలో చూడగలం. ప్రజలు కప్పములను, పన్నులను చెల్లించేవారు. రాజు, రాజప్రతినిధులు, మంత్రులు వగైరా పరిపాలకులు వుండేవారు. సైన్యంవుండేది. ధర్మశాస్త్రము లనబడే శాసనములు యేర్పడినవి. ఈ ధర్మశాస్త్రముల ననుసరించి రాజు న్యాయాన్యాయ విచారణ గావించేవాడు.

సమాజంయొక్క యీ దశకు అనుగుణ్యంగానే మనుస్మృతి పుట్టింది. సమాజంలోని వర్గాలు వర్ణములక్రింద విభజింపబడి శాశ్వత ప్రకృతులుగా శాసింపబడినవి. 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం' అన్నది అప్పటినుండే పరమధర్మంగా మనుస్మృతి శాసించింది. బ్రాహ్మణులు, క్షత్రియులు, పరిపాలకవర్గాలు, వ్యవసాయంగావించే వైశ్యులు, అగ్రవర్ణాలకు బానిసత్వంచేసే 'శూద్రులు' యీ నాల్గు వర్ణాలుగా అప్పటి వర్ణవిభజన రూపమును పొందింది. బానిసలకు ఆస్తి వుండరాదు. శూద్రులు చదవరాదు. తపస్సును అసలే చేయరాదు. స్త్రీలుకూడా చదవరాదు. ఆస్తిని కల్గివుండరాదు. స్త్రీకి బాల్యంలో తండ్రి, యువ్వ

నంలో భర్త. వార్ధక్యంలో కుమారుడు సంరక్షకులనే న్యాయం యేర్పర్చబడ్డది. స్వయంవరం హక్కుపోయి, కన్యాదానం వచ్చింది. రాజు విష్ణు హంశసంభూతుడౌతాడు. జలగయెట్లా రక్తమును పీల్చుతుందో, లేగదూడ యెట్లా పాలుతాగుతుందో తేనెటీగ యెట్లా తేనెను గ్రహిస్తుందో అదేవిధంగా రాజు తన ప్రజలనుండి స్వల్పంగా పన్నులను తీసుకోవాలి. పశువులు, బంగారముల వృద్ధిలో 6. వ భాగమును, పంటలో 6 వంతు గాని, 8 వ వంతుగాని, 12వ వంతుగాని పన్నుగా తీసుకోవాలి. తనశక్తి కొలది ప్రజలను రక్షించే పక్షంలో యుద్ధకాలములో మాత్రం క్షత్రియుడు పంటలో 4వ వంతునుతీసుకున్నా నిందింప బడడు అని పన్నుల విధానాన్ని మనస్మృతి మొట్టమొదటగా వివరించింది.

బానిసత్వంపై ఆధారపడిన యీ వ్యవస్థ అంతర్వై రుద్ధ్యాలతో శిథిలమైపోసాగింది. యూరప్‌లో రోమను సామ్రాజ్యంలో సామ్రాజ్య విస్తీర్ణత జరుగుతున్నకొద్దీ ప్రజలపై పన్నులు, కప్పముల భారాలు అధికమయ్యాయి. ఇందు మూలంగా అల్లకల్లోలములు బయలుదేరాయి. ఇదేవిధంగా స్వతంత్రులకన్న బానిసలే యెక్కువవుండుటచే (ఏథెన్సులో 90,000 స్వతంత్రపౌరులైతే 3,66,000 బానిసలూ, 45,000 విదేశీయులూ, అస్వతంత్రులగు స్వదేశీరక్షిత ప్రజలూ వుండే వారు. కారింథ్‌లో 4,60,000, లవాజీలో 4,70,000 బానిసలు వుండేవారు. ఈ బానిసల సంఖ్య స్వతంత్ర పౌరుల జనాభాకు 10 రెట్లు) యజమానుల దౌర్జన్యములు మతిమీరినకొలదీ తిరుగుబాట్లు హెచ్చి సామ్రాజ్యపు పునాదులే కదిలిపోయాయి.

(స్పార్టకస్ నాయకత్వాన జరిగిన తిరుగుబాటు చాలా ప్రధాన మైనది.) విశాలక్షేత్రాలు గల భూఖామందులు కూడ బానిసలచే వాటిని సాగుచేయించుటకంటె కొంత ఆసక్తి గలవారిచే సాగుచేయించుట ప్రయోజనకరమనే వుద్దేశంతో యెస్టేట్లను చిన్న చిన్న పీకలనుచేసి, చిన్న చిన్న రైతులకు యిచ్చి దానికి ప్రతిఫలంగా మిగిలినభూమిమీద వెట్టిచేసి భూస్వామికి పంటపంకించాలనే నిబంధన ఏర్పరిచారు. ఈవిధంగా పాశ్చాత్య దేశాల్లో బానిసత్వం అంతమై ఫ్యూడలిజం వచ్చింది.

## భూ స్వా మ్య వి ధా న ము

బానిసవిధానంలో వుత్పత్తి సాధనాలు, వుత్పత్తి గావించే బానిసలుకూడ యజమానికి సొంతిసొమ్ము. కాని ఫ్యూడలిజంలో వుత్పత్తిసాధనమైనభూమి భూస్వామిది, ప్రభువుది. పనిచేసే వారిపై పూర్తి హక్కులను కాకపోయినా కొన్ని హక్కులను కల్గివుంటాడు. బానిసనువలె అర్థబానిసను చంపుటకు వీల్లేదు. కాని అర్థబానిస భూమికికట్టుబడి వుండుటచే భూమితో బాటుగా క్రయవిక్రయములకు లోనయేవాడు. ఈ విధంగా ఫ్యూడల్ ప్రభువు – అర్థబానిస స్వతంత్రులగు చిన్నరైతులూ, చేతివృత్తులవారూ వుండేవారు. వారు తమ సొంతశ్రమతో, తమ సొంతపరికరాలతో, స్వల్పంగా వుత్పత్తి గావిస్తూ వుండే వారు. ఈ దశలో వుత్పత్తి శక్తులు యింకా పెరిగినవి. ఇనప పనిముట్లు విస్తారంగా వాడకంలోకి వచ్చాయి. వ్యవసాయమే ప్రధానవృత్తి అయింది. పండ్లతోటలు వృద్ధియైనవి. వ్యవసాయానికి ఉపాంగములుగా చేతిపనులు ప్రతిగ్రామంలోనూ

ఏర్పడ్డాయి. క్రమంగా చేతిపనులు, కార్ఖానా దశగా అభివృద్ధి అయినవి.

ఈదశలో స్వంత ఆస్తి మరీస్పష్టంగా పెరగటం కన్పడుతుంది. భూమిఅంతా సర్వహక్కులతోనూ ఫ్యూడల్ ప్రభువులదే. అదేవిధంగా చేతిపనులలో పనిముట్లన్నీ మేస్త్రీవే. అర్ధబానిసకు భూమిపైగాని, వృత్తిపనివారలకు(జర్నీమెన్), అభ్యాసకులకు (అప్రెంటిస్) పనిముట్లపైగాని యేలాంటిహక్కులూ వుండవు. వారికి కూలి రేటు అనేదిగాని, పనిచేసేగంటల నిర్ణయంగాని వుండదు. యజమానివద్ద తింటూ, యజమాని చెప్పినంతకాలం పనిచేయుటే వారికర్తవ్యం. ఈవిధంగా దోపిడీ సాగింది.

భారతదేశంలో బానిసవిధానం మహాభారత యుద్ధ కాలంనాటికి అత్యున్నతస్థాయికి వచ్చింది. (క్రీ. పూ. 1500) బానిసరాజులైన కౌరవ పాండవ కలహాలలో అది బలహీనపడి దాని పతనావస్థ ప్రారంభమైంది. మహాభారత యుద్ధానంతరం నాగప్రజల తిరుగుబాటు ఈ విధానాన్ని మరింత ధ్వంసంచేసింది. గంగా సింధు నదీప్రాంతంలో పెద్దరాజ్యాలు నశించి, చిన్నచిన్న రాజ్యాలు ఏర్పడ్డాయి. సుస్థిరపరిపాలన లేక అరాచక పరిస్థితులేర్పడ్డాయి. కరువు కాటకాలు, వరదలు ఫలితంగా గంగా సింధు నదీప్రాంతంనుండి అనేక తెగలు క్రీ.పూ. 600 అంతకు కొంచెంముందుగా దేశం నాలుగుదిక్కుల చెదరిపోసాగాయి. ఆంధ్రులు, కాళింగులు ఆ దేసమయంలో యమునాతీరాన్ని వదలి వింధ్యపర్వతాలను దాటి దక్షిణదిశగా కదలిపోయినారు.

సరిగ్గా ఇదేకాలంలో (క్రీ. పూ. 550) గౌతమబుద్ధుని సిద్ధాంతాలు ప్రారంభమైనవి. సమానత్వాన్ని బోధించి, కులభేదాలను ఖండించిన బుద్ధుని బోధనలు బానిసవిధాన పతనానికవసరమైన సామాజిక విప్లవాన్ని కలిగించాయి. క్రీ. పూ. 400 ప్రాంతంనాటికే అర్ధబానిస విధానము భారతదేశంలో ప్రారంభమైంది. క్రీ. పూ. 300 ప్రాంతంలో రచించబడ్డ చాణక్యుని అర్థశాస్త్రాన్నిబట్టే మనం ఈ విషయాన్ని గమనించగలము.

భారతదేశంలో అర్ధబానిస విధానం, ఆదిమ కమ్యూనిస్టు, బానిస, ఫ్యూడల్ విధానాల మిశ్రణరూపంలో ఏర్పడ్డది. అడుగున, ఆదిమ కమ్యూనిస్టు చిహ్నాలను కల్గిన గ్రామీణ ఆర్థికవ్యవస్థా, శిఖరమున అతి నిరంకుశమగు, సార్వభౌమిక రాజపరిపాలన వుండటం కన్పించగలదు. 'భండార్కర్' మున్నగు వారు యీ గ్రామీణ వ్యవస్థనుగూర్చి వ్రాశారు. హరివిలాస శారదకూడా భూమి ప్రతి ఒకటి, రెండు తరములకు పునర్విభజింపబడిందని తెల్పారు. కాబట్టి రష్యాలోని 'మీర్'లవలెనే భారతీయ గ్రామపంచాయితీలకు భూమిపై కొన్ని స్వత్వము లుండుట కన్పించగలదు.

రాజు పన్నులు వసూలు చేయుట యిప్పటి మహల్వారీ పద్ధతివలెనే (ఇది నిజానికి పూర్వపద్ధతినే ప్రస్తుతకాలానికి అనుగుణ్యంగా నిలబెట్టడం) గ్రామమొత్తంమీద వుమ్మడిగా గ్రామ పంచాయితీనుండి వసూలుచేస్తూ వుండేవారు. కాని యీ పైకప్పు క్రిందనే స్వంత ఆస్తి యేర్పడుతూ వచ్చినదనీ, భూమి, క్రయవిక్రయాలు జరుగుతూ వచ్చినవనీ, పూర్వగ్రంధములవల్ల

తెలియగలదు. సప్త దానములలోనూ భూదానము వొకటిగా చెప్పబడుట చేతనూ, దానంచేసేహక్కు బ్రాహ్మణ, క్షత్రియులకే వుండటంవల్లనూ, యితరులకు దానంచేసేహక్కు, దానం గ్రహించే హక్కుకూడా నిషేధింపబడుటవల్లనూ భూమిపై స్వంత ఆస్తి హక్కులు యేర్పడ్డవనీ, యిదిపాలక వర్గాల చేతుల్లోనే కేంద్రీకరింపబడి వున్నదనీ తెలియగలదు. బ్రిటిషుపాలనకు చాలాకాలం ముందునుంచీ యీనాములు, అగ్రహారములు, మొఖాసాలు వున్నవికాబట్టి ఆనాటికికూడా పరాన్నభుక్కులగు ఒకవర్గం వున్నదని తెలియగలదు. పన్నిద్దరాళ్వారులలో వొకడగు నందుని చరిత్రవల్ల ఆనాడు వెట్టిచాకిరి విధానం, దాస్యపద్ధతి (సెర్ఫడం) వున్నదని ఋజువగుచున్నది. షర్లాకాలంలో ప్రారంభమై తోడర్‌మల్లుచే పూర్తిగావించబడిన సర్వేపద్ధతి కూడ భూవిభజననూ, స్వంత హక్కులనూ తెలియజేస్తుంది. దాయభాగం కానీయండి, మితాక్షర కానీయండి, వారసత్వం, స్థిర చరాస్థులకు సంబంధించే నిర్ణయింప బడటంవల్లకూడా భూమిలో స్వంత ఆస్తి స్వత్వములు యేర్పడుట సూచిత మగుచున్నది. ధర్మశాస్త్రముల ప్రకారం సమిష్టి కుటుంబమే సమాజమునకు ప్రాతిపదిక కాబట్టి కుటుంబ స్వంతఆస్తి యేర్పడినదనీ, అది దాయభాగ మితాక్షర సూత్రాలప్రకారం వారసులకు చెందేదనీ తెలియగలదు.

కాబట్టి ఆదిమ కమ్యూనిస్టు సమాజ చిహ్నాలను కలిగిన గ్రామీణ ఆర్థిక కప్పుక్రిందనే కుటుంబస్వంత ఆస్తి, వ్యక్తిగత ఆస్తి అనేది – కొన్ని హద్దులకు లోబడి – యేర్పడినదీ, భూమిపై పూర్తిహక్కు లేకపోయినా, శ్రమచేయకుండా భూమిపైనుండి

వచ్చే ఆదాయాన్ని దిగమింగే పరాన్నభుక్కులవర్గం - బయలు దేరిందనీ తెలియగలదు.

వ్యవసాయంలో బానిస లుండరాదని, నగరాలలో మాత్రమే వాకుండవచ్చునని చాణుక్యుడు శాసించాడు. ఈ సూత్రమే స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థకు పునాది. నగరాలలో 10 పద్ధతులద్వారా బానిసలను స్వీకరించవచ్చుననీ, వారిని రాజభవనాలలోను, సేనలోను, ధనికులఇండ్లలోను, గనులలోను పనిచేయించవలెనని అర్థశాస్త్రంలో వివరించబడ్డది. నాటి నగరాలలోని బానిసలే నిన్నమొన్నటివరకు జమీందారుల కోటలలోని దాస దాసీజనము.

రాజ్యాంగ పరిపాలనను గురించి కౌటిల్యుని సిద్ధాంతాలు ఇవి:

"నావిష్ణుః పృథివీపతిః" అనేసిద్ధాంతం పరమన్యాయంగా సుస్థిరం గావింప బడింది. రాజుకు మంత్రులు సలహాదార్లు మాత్రమే; వివిధశాఖల తలలుమాత్రమే. పరిపాలనా సౌకర్యము కొరకై వివిధశాఖలు యేర్పడినవి. వాణిజ్యశాఖ, వ్యవసాయశాఖ (ఇరిగేషన్ శాఖ), పోలీసుశాఖ, గూఢచారులశాఖ, వగైరాలన్నీ రాజ్యాంగయంత్రముయొక్క అధికారాంగములుగా పరిపూర్ణ మొనర్చబడినవి. యుద్ధము రాజుకు పరమధర్మముగా (రాజ్యము వీరభోజ్యము) యేర్పర్చబడింది. రాజబొక్కసమునకు పన్నులు, సామంతుల కప్పములు యెంతముఖ్యమో, పరరాజ్యముల దోపిడీకూడ అంత ముఖ్యమైనదే. సామ, దాన, భేద, దండోపాయములు రాజనీతియైనవి.. అతి కఠినమగు శిక్షలు విధించే శిక్షాస్మృతి యేర్పడింది. అతి బలీయమగు

స్థిరసైన్యం (స్టాండింగ్ ఆర్మీ) యేర్పర్చబడింది. రాజ్యరక్షణకై వివిధప్రాంతాల్లోనూ కోటలు నిర్మింపబడినవి. వర్తక వాణిజ్యముల అభివృద్ధి వీలుకై రోడ్లు నిర్మించబడినవి. పట్టణముల్లో వర్తకసంఘములు (గిల్డ్సు) యేర్పడినవి. నాణెములు చలామణీలోనికి వచ్చినవి.

మౌర్యుల కాలంలో సర్వాంగపూర్ణంగా యేర్పర్చబడిన రాజ్యాంగయంత్రం ఖిల్జీవంశస్థుల చేతుల్లోనూ, అటుపిమ్మట మొగలుల చేతుల్లోనూ పరిపూర్ణ మొనర్చబడ్డది.

ఈ సమాజవ్యవస్థలో దోపిడీరూపం మారిందేగాని అంతరించలేదు. ఒకవైపున (దాసులుగావున్న) వ్యవసాయదార్లు, చిన్న చేతిపనులవారు, అతిహేయమగు, హీనమగు పరిస్థితులలో సంపదల నుత్పత్తి గావించేవారు. మరొకవైపున రాజరికం, పురోహితవర్గం, భూస్వాములు వస్తువుల మారకంతో బాటు తప్పనిసరిగా వెలసిన దళారీవర్తకులు వగైరాలు యీ వుత్పత్తిలోని మీగడనంతా కాజేస్తూ వుండేవారు. ఈ యిరుపక్షాల మధ్యనూ వర్గపోరాటం సాగుతూ వుండేది.

## పెట్టుబడిదారీవిధానపు జననం

సమాజ చరిత్రలో తర్వాత దశయగు పెట్టుబడిదారీ విధానం పాశ్చాత్యదేశాలలో ఒకవిధంగానూ, ప్రాచ్యదేశాలలో మరోవిధంగానూ అభివృద్ధియైనది. పాశ్చాత్యదేశాలలో సహజంగానే, జాతీయంగానే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధియైనది.

ఫ్యూడల్ విధానములో ప్రధానవుత్పత్తి సాధనములు: భూమి, చేతిపనిముట్లు; వృత్తులు: వ్యవసాయం, చేతిపనులు. కాని యీ వుత్పత్తిశక్తులు యెల్లకాలం ఒకచోటనే నిల్వలేదు. చేతి పనులు ముందు అభివృద్ధియైనవి. పెద్దపెద్ద బస్తీలలో వృత్తి నిపుణులు చేరి, అభ్యాసకులనూ, వృత్తిసేవారలనూ సహాయం చేసుకొని వివిధ సరుకులను వుత్పత్తిగావించ సాగేరు. వర్తక వాణిజ్యములు విపరీతంగా వృద్ధిపొందటం, వర్తకసంఘాలు యేర్పడటం, అంతకంతకు యీ వర్తకసంఘాల ప్రాబల్యం విస్త రించడం జరిగింది. చేతిపనులు, కార్ఖానా వుత్పత్తిక్రింద అభివృద్ధి యైనవి. ఒక ధనికుడే పెట్టుబడిసిపెట్టి అనేకమంది చేతిపనులవారిని ఒకచో చేర్చి, వారిచే వుత్పత్తిని చేయించుటే యీ కార్ఖానా వుత్పత్తిపద్ధతి. ఉత్పత్తిపరికరములూ, ఉత్పత్తిగావింపబడిన సరు కులూకూడా పెట్టుబడిదారువే. కాని ఈ పారిశ్రామికాభివృద్ధికీ, వ్యాపారాభివృద్ధికీ ఫ్యూడలిజం అడ్డుగా నిల్చింది. వర్తకవ్యాపా రములపైనా, పరిశ్రమలపైనా అనేకరకములగు పన్నులు, రుసు ములు, లైసెన్సుఫీజులు విధింపబడేవి. స్వేచ్ఛావ్యాపారంపై అనేకములగు ఆటంకములు కలుగచేయబడినవి. వర్తకసంఘ ములుకూడా యిట్టి ఆటంకములను కల్గించి నూతనంగా వచ్చే పోటీదార్లకు చోటులేకుండా చేయచూసినవి. యుద్ధము లెక్కు వైనకొలదీ రాజులు, ప్రభువులు పన్నులు అధికంచేయుటజరిగేది. ఇదేసమయంలో భూస్వాములు అర్ధబానిసలను దోచుకొనటం వృద్ధిఅయి వెట్టిచాకిరిపద్ధతి హెచ్చినది. రైతుతిరుగుబాటులు దేరినవి. 14 వ శతాబ్దం అంతంలో ఇంగ్లాండులో వాట్ టైలర్ నాయకత్వాన జరిగిన రైతుతిరుగుబాటు, 15 వ శతాబ్దంలో మతసంస్కరణల కాలంలో బయలుదేరిన రైతుల

యుద్ధాలు సమాజవ్యవస్థను మూలమట్టాలవరకూ ఊపివేసినవి. ఈ విధంగా ఒకవైపున వికాసం పొందుచున్న బూర్జువావర్గమూ, అర్థబానిసలూ; మరొకవైపున నిరంకుశ రాజరికము, ఫ్యూడల్ ప్రభువర్గము, యీ రెండింటి మధ్య పోరాటం బయలుదేరింది.

ఫ్యూడల్ విధానము నాశనమై వర్తక వ్యాపారములకు స్వేచ్ఛగల్గటం, పరిశ్రమల్లో పనిచేయుటకుగాను దాసులుగానున్న రైతాంగం విముక్తిపొందటంపారిశ్రామికాభివృద్ధికిఅత్యంత ఆవశ్యకము. ఇందుకై రాజులతో మూర్తీభవించియున్న నిరంకుశ ప్రభుత్వమును కూలద్రోసి రాజ్యాంగ యంత్రమును స్వాధీనం చేసుకోవాలి. ఇందుకై విప్లవపోరాటాలు బయలుదేరినవి. చివరకు 1648 లో యింగ్లండులో విప్లవం జరిగి రాచరికం ఓడించబడింది. 1688 లో యింకొక విప్లవం జరిగి రాచరికం పూర్తిగా లొంగటం, 1832 లో సర్వాధికారాలు పూర్తిగా బూర్జువావర్గానికి సంక్రమించటం జరిగింది. ఫ్రాన్సులో 1789లో బూర్జువా విప్లవములు జరిగి, ఫ్యూడల్ విధానము కూలద్రోయబడి పెట్టుబడిదారీ వ్యవస్థయే సమాజ వ్యవస్థగా యేర్పాటుగావటం జరిగింది. జర్మనీలో 1848 లో వచ్చిన బూర్జువావిప్లవం ఓడిపోయినా, 1864-71 లలో బిస్మార్క్ నాయకత్వాన జర్మనీలో బూర్జువాధికారం ఏర్పడింది.

## సామ్రాజ్యవాదము

క్రీ. శ. 1900 సంవత్సరంనాటికి యూరపులో పెట్టుబడిదారీవిధానం అత్యున్నతస్థాయికి వచ్చింది. ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు-అనుమూడు దేశాలలో పెట్టుబడిదారీవర్గము తమ దేశములోని కార్మికవర్గాన్ని దోపిడీచేయుటతో సంతృప్తిపడక ప్రపం

చాన్నంతా ఆక్రమించుకోసాగింది. 1900 సంవత్సరంనాటికి ఆసియా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికాలోని వివిధ దేశాలు ఏదో ఒక సామ్రాజ్యవాద పరిపాలనకు లోబడినవి.

దీనితో పెట్టుబడిదారీ విధానములో ఒక గుణాత్మకమైన మార్పు వచ్చింది. ప్రపంచమంతటా ఒకే వలయమైంది.

ఇంతేగాక పెట్టుబడిదారీవిధాన అంతరంగిక నిర్మాణంలో కూడా మార్పువచ్చింది. పారిశ్రామిక పెట్టుబడి, బాంకింగు పెట్టుబడి కలిసి గుత్తపెట్టుబడిదారీ విధానంగా మారిపోయింది. ఈ గుత్త పెట్టుబడిదారీ విధానఫలితంగా కార్మికవర్గానికి, పెట్టుబడిదారీ వర్గానికి గల వైరుధ్యాలు మరింత తీవ్రతరమైనవి.

లాభంకొరకు ఉత్పత్తి అను సూత్రంపై ఆధారపడ్డ పెట్టుబడిదారీ విధానంలో, ఆర్థిక సంక్షోభాలు ప్రారంభంనుంచీ ఉన్నవి. కార్మికులు, రైతాంగము పేదప్రజానీకము రోజు రోజుకూ మరింత బీదవారు గావటంవల్ల వారి కొనుగోలు శక్తి పడిపోయి, సరుకులు విడుదలకాక, ఆర్థిక సంక్షోభాలు ఏర్పడ సాగినవి. సామ్రాజ్యవాదంపై వలస పరాధీన దేశాల ప్రజలు సాగించిన జాతీయపోరాటాలు ఈ సంక్షోభాన్ని మరింత తీవ్ర తరం చేసాయి. సామ్రాజ్యవాద వైరుధ్యాలు పెరిగిపెరిగి, చివరకు ప్రథమ ప్రపంచ మహాసంగ్రామం 1914 లో జర్మనీ, ఇంగ్లాండు సామ్రాజ్యాలకు ప్రారంభమైంది.

సోషలిజం

1917 లో రష్యాలో లెనిన్, స్టాలిన్‌ల నాయకత్వాన సోషలిస్టు విప్లవం రావటంతో చరిత్రపరిణామంలో 5 వ దశ ప్రారంభమైంది.

1917 నుండి' 35 వరకు లెనిన్ స్టాలిన్‌ల నాయకత్వాన సోవియట్ ప్రభుత్వము తీసుకున్న వివిధ చర్యల ఫలితంగా, అమలుజరిపిన విప్లవ విధానాలఫలితంగా, రష్యాలో పెట్టుబడి దారీ భూస్వామి ఆస్తి సంబంధాలు నశించి సోషలిస్టు ఆస్తి సంబంధాలు ఏర్పడ్డవి.

పరిశ్రమలన్నీ ప్రభుత్వపరం చేయబడ్డవి. సమిష్టి వ్యవసాయం, - ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు - అనే పద్ధతిలో వ్యవసాయంలోకూడా సమిష్టిఆస్తి పద్ధతి ప్రవేశపెట్టబడ్డది. వర్గాలు, వర్గదోపిడీ రద్దుచేయబడ్డవి. దారిద్ర్యం, నిరుద్యోగం నశించినవి. 'లాభంకొరకు ఉత్పత్తి' అను పెట్టుబడిదారీ సూత్రం స్థానంలో 'ప్రజల అవసరాలను తీర్చేందుకు ఉత్పత్తి' అనే సోషలిస్టు ఉత్పత్తిసూత్రం అమలులోకి రావటంతో, ప్రజల జీవిత ప్రమాణం నిరంతరం పెరగసాగింది. వర్గరహిత కమ్యూనిస్టు సమాజంవైపు రష్యా త్వరితగతిని పురోగమిస్తున్నది.

ఆర్థికవిధానంపై సమాజజీవితమంతా ఆధారపడి ఉంటుందని మనం తెలుసుకున్నాము. పెట్టుబడిదారీ విధాన పునాదిపై నిర్మించబడిన పెట్టుబడిదారీ నాగరికతను సోషలిస్టు పునాదిపై నిర్మించబడిన సోషలిస్టు నాగరికతను - రెంటిని మన కళ్ళయెదుటనే మనం చూస్తున్నాము.

నామమాత్రపు ప్రజాస్వామ్యాన్ని ఓటుహక్కులను మాత్రం ప్రజలకు ఇచ్చిన, పెట్టుబడిదారీ రాజ్యాంగ వ్యవస్థ ఒక వైపున ఉన్నది. ప్రజల ఆర్థిక, రాజకీయ, సాంఘిక అవసరాలన్నింటినీ తీర్చే బాధ్యతను వహించి, ఆ బాధ్యతలను జయప్రదంగా నిర్వహిస్తున సోషలిస్టు ప్రజాస్వామ్యం మరొక

వైపున ఉన్నది. "ప్రజల అవసరాలను గుర్తించి వాటిని తీర్చటమే నిజమైనస్వాతంత్ర్యము (Freedom is the recognition of necessity)" అన్న సూత్రాన్ని సోవియటు రష్యా అమలు జరుపుతున్నది. పనిచేసే హక్కు, సోవియటు ప్రజల కుంది. దానిని తీర్చేబాధ్యత ఆప్రభుత్వం నెరవేరుస్తున్నది. పెట్టుబడిదారీ రాజ్యాంగంలో హక్కులన్నీ ప్రజలకు కాగితాలమీద మాత్రమే ఉన్నవి. ప్రభుత్వం, గుత్తపెట్టుబడిదారుల ప్రయోజనాలను కాపాడే బాధ్యత ఒక్కటి మాత్రమే నిర్వహిస్తున్నది.

## ముగింపు

చారిత్రక భౌతికవాద సిద్ధాంతాలను సూక్ష్మంగా పరిశీలించాము. సమాజ చరిత్రనుకూడా క్లుప్తంగా తెలుసుకున్నాము.

ఈ పుస్తకాన్ని ముగించేముందు పాఠకులకు సాధారణంగా వచ్చే ఒక సందేహానికి సమాధానం ఇవ్వవలసి ఉంటుంది.

ఇంతవరకు సమాజం వివిధదశలలో పరిణామంచెందుతూ సోషలిస్టు వ్యవస్థవరకూ వచ్చింది. వర్గపోరాటమే సమాజ పరిణామానికి కీలకమని తెలుసుకున్నాము. ఇకముందు వర్గ పోరాటం ఉండమకదా. కనుక పరిణామం ఇంతటితో ఆగిపోతుందా? అని కొందరు ప్రశ్నించవచ్చు.

ఉత్పత్తిశక్తుల పెరుగుదల కనుగుణ్యంగా ఉత్పత్తి సంబంధాలను మార్చుకోవటం సమాజపరిణామానికి కీలకం. గత చరిత్రలో ఇది ఎంత వాస్తవమో, భవిష్యత్తులోకూడా ఇది వాస్తవమే. అయితే ఇంతకుపూర్వము, ఒక్కొక్కవర్గము తన

వర్గ ప్రయోజనాలకోరకు మాత్రమే పోరాడుతూ ఉండేది. వర్గపోరాటము, విప్లవాలు, యుద్ధాలు - వీటి రూపంలో కొంత జననష్టం జరిగిన మీదట తిరిగి ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు సమన్వయం కుదురుతూవచ్చింది.

ఇకముందు అలా కాకుండా, ఒక పథకం ప్రకారం మానవ సమాజం అంతా పురోగమిస్తుంది. వర్గరహిత సమాజం స్థాపించ బడుటతో ఉత్పత్తిశక్తులపై పూర్తిపెత్తనం సంపాదించిన మానవుడు, వాటి పురోగమనంపై పూర్తిఅధికారాన్ని సంపా దిస్తాడు. సంక్షోభాలు, విప్లవాలు, యుద్ధాలు లేకుండానే ఉత్పత్తిశక్తులకు, ఉత్పత్తిసంబంధాలకు మధ్య సమన్వయం సాధించబడుతుంది.

సోషలిస్టు సమాజస్థాపన అనంతరం, సమాజం చీకటిలో నుండి వెలుతురులోకి పురోగమిస్తుంది అని మార్క్స్ ఒక సందర్భంలో తెలియజేశాడు.

ఆంతరంగిక వైరుధ్యాలఫలితంగానే మానవసమాజం ముందుకు పురోగమిస్తూ ఉంటుంది అనే గతితార్కికసూత్రం అప్పుడుకూడా వర్తిస్తుంది. అయితే ఈ వైరుధ్యాల స్వభావం, స్వరూపం, వానిని పరిష్కరించే పద్ధతులు ఇవి పూర్తిగా మారిపోతాయి.

అంతేకాదు. ప్రకృతిపై మానవుడు ఇంకాధిక విజయా లను సాధించటం సాధ్యమౌతుంది. ఇంతవరకూ జరిగిన విజ్ఞాన శాస్త్రాభివృద్ధి అంతా పెట్టుబడిదారీ వర్గప్రయోజనాలకు అను గుణ్యంగా ఉన్నంతవరకూ మాత్రమే జరుగుతూ వచ్చింది.

ఇకముందు అలాగాకుండా మానవులంతా ఒకే కుటుంబంగా ప్రకృతిపై విజయాలు సాధిస్తారు.

అణుశక్తిని ఉపయోగించుకోవటం నేడు మనం నేర్చుకున్నాము. విద్యుచ్ఛక్తిద్వారా పరిశ్రమలు నడపటం ప్రారంభమైన మీదట యంత్రయుగ నాగరికతలో ఎంతటి బ్రహ్మాండమైన మార్పు వచ్చిందో, అణుశక్తిని పరిశ్రమలకు, వ్యవసాయానికి వర్తింపచేసినట్లయితే అంతకంటె బ్రహ్మాండమైన మార్పులు వచ్చి ప్రపంచమంతటా ఉత్పత్తిశక్తులు పదిరెట్లు, వందరెట్లు పెరగగలవు.

కాని, ప్రపంచ సామ్రాజ్యవాద నాయకులైన అమెరికన్ సామ్రాజ్యవాదుల స్వప్రయోజనాలే ఇందుకు ఆటంకంగా ఉన్నవి. అణుశక్తిద్వారా పరిశ్రమలు, వ్యవసాయము సాగితే, తమ లాభాలు దెబ్బతింటాయనే ఉద్దేశంతో ఆ ప్రయత్నాలను వాటు చేయక, పైపెచ్చు మారణాయుధాల నిర్మాణానికి అణుశక్తిని వినియోగిస్తున్నారు.

కనుక అణుశాస్త్రాభివృద్ధికి అమెరికన్ సామ్రాజ్యవాదము ఆటంకంగా ఉన్నది. అమెరికన్ సామ్రాజ్యవాదము, దానితో పాటు ప్రపంచ సామ్రాజ్యవాదము నశించిననాడు అణుశక్తి మానవుని పెరట్లోని కల్పవృక్షం కాగలదు. ప్రపంచ కమ్యూనిజానికి ఆనాడే మార్గం సుకరమౌతుంది.

23-8-54



 మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B174 |
| పుస్తకం పేరు | చారిత్రక భౌతికవాదం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ashwini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Ashwini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |